# చందమామ

ఏప్రిల్ 1963



## 'నాకొక స్వంత సేవింగ్స్ బ్యాంక్ పాస్ బుక్!...'

..."శ్రేష్ఠమయినది కావలయునని నా కోరిక—
అందుచే ది బ్యాంక్ ఆఫ్ ఇండియా లిమిటెడ్ లో
నా సేవింగ్స్ బ్యాంక్ ఎక్కవుంటు వున్నదిగదా!
నా చేతికి వచ్చిన ప్రతి పైసను ఆ ఎక్కవుంటులో
వేయుదును. దానిని నే నెందులకు నిలవచేయు
చున్నానంటారా?—ఆ, ... అదే నా రహస్యము!"

**ప్రత్యేక సౌకర్యము**

సంవత్సరమునకు మీకు **100 చెక్కులు:** ఎప్పుడు కావలసిన అప్పుడు, ఎంత సొమ్ము కావలసిన ముందుగా నోటీసీయనక్కరలేకుండగనే తీసికొనవచ్చును — ఆ, మీరు నిలవయుంచిన ధనమునకు సంవత్సరమునకు **3%** చక్రవృద్ధి వచ్చునుకదా!

# ది బ్యాంక్ ఆఫ్ ఇండియా లిమిటెడ్

టి. డి. కన్సారా, జనరల్ మేనేజర్



B/C/95/TL

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ, మరి ఎన్నో ఆకర్షణలు.

# తుషార్‌తో వండిన పదార్థాల రుచి ఇంట్లో అందరికీ యిష్టమే




తుషార్ వనస్పతిలో వున్న ఆ ప్రత్యేకమైన రుచివల్ల అది కుటుంబాని కంతకూ యిష్టమైన పదార్థమైంది. తుషార్‌తో చేసిన వంటకాలు ఎక్కువరుచిగా వుండుటమేగాక పుష్టికరంకూడా. ఎందుకంటే తుషార్‌లో ఎ,డి, విటమినులు వున్నాయి. రుచికరమైన భోజనంకోసం తుషార్‌ను వాడండి!

## తుషార్

వనస్పతిలో ఎ, డి
విటమినులు కలవు.

తుంగభద్రా ఇండస్ట్రీస్ లిమిటెడ్, కర్నూలు

# పాఠకుల లేఖలు

## ఏప్రిల్ 1963

"రాకాసిలోయ" రసవత్తరంగా నడచిపోతున్నది. "గంధర్వ చక్రవర్తి కూతురు" చాలా ఇంపుగా ఉంది. అన్నిటికంటె చిత్రకారుడు శంకర్‌గారి "ప్రపంచపు వింతలు" కనులకింపుగా నుండి చాలా ఆశ్చర్యపరచుచున్నవి.

—కె. శ్రీనివాసులు నాయుడు, కడప

మార్చి నెల "చందమామ" ముఖచిత్రం అత్యంత ఆకర్షణీయంగా ఉంది. "చ్యవనుడి కథ", "నిజంలాటి కల" చాల బాగున్నవి.

—కుసుమంచి నూకయ్యశెట్టి, విశాఖపట్నం

"విషమ పరీక్ష", "నిజంలాటి కల", "యుక్తి వేరు - శక్తి వేరు", ఎంతో ఆకర్షణీయముగా నున్నవి. "చందమామ" ధర 75 న. పై.లు చేసినా కళ్ళు కద్దుకొని కొనవచ్చు.

—ద్వారం సాయిప్రకాశరావు,
విజయనగరం

"చందమామ" రాగానే మొట్టమొదట "రాకాసిలోయ" చదువుతూంటాను. నాకు "దాస్య విముక్తి" గేయకథ చాలా బాగుంది. ఇది రచించిన ఉత్పల సత్యనారాయణాచార్యగారు అభినందనీయులు.

—పెదిరెడ్ల రాంబాబు, అనపర్తి

ఈ నెల "చందమామ" అసలు చందమామ కంటె ఎన్నో రెట్లు అందముగను, ఆకర్షణీయముగను (ఉండి) పాఠకుల నందరిని ఆకర్షించినది.

—సి. వి. రావు, విశాఖపట్నం

నేను ప్రతి నెలా "చందమామ" కొని "రామాయణం" చదువుతూంటాను. మార్చి నెల ముఖచిత్రం చూడ ముచ్చట గొల్పుచున్నది. అది వేసిన వడ్డాది పాపయ్యగార్కి నా ధన్యవాదములు. "రాకాసిలోయ" చాలా బాగుంటున్నది. "గంధర్వ చక్రవర్తి కూతురు", ఏప్రియల్ సంచిక ఇప్పుడే వస్తే ఎంత బాగుండును అని పిస్తుంది, చాలా రసవంతంగా ముందుకు సాగుచున్నది.

—పి. వెంకటేశ్వరరావు, వాడపాలెం

"చందమామ" నెల నెలకూ ఇంకా చాలా ఆకర్షణీయముగా వుంటున్నాది. ఈసారి కథలన్నీ బాగున్నాయి. సీరియల్ కథ మరీ బాగుంది. "చందమామ" కోసం నేను, చంద్రుని చకోరాలు నిరీక్షించినట్లు నిరీక్షిస్తుంటాను.

—(కుమారి) ఎమ్. ఎస్. ఎన్. పి. జేమ్స్,
పార్వతీపురం

మార్చి సంచికలో "వివేకానందుని బాల్యం" గురించి చాలా బాగా వ్రాసినారు. ఈ సంచిక లోని కథల కన్నా కూడ ఇది ఎంతో బాగుంది.

—ఎ. పి. పి. కాశీపతి, తెనాలి

ఈ నెల "చందమామ" చాల ఆకర్షణీయం. "దాస్య విముక్తి" గేయకథ చాల బావుంది. "చ్యవనుడి కథ", "విషమ పరీక్ష", "యుక్తి వేరు - శక్తి వేరు", "నిజంలాటి కల"—ఈ కథలు మా ఇంటి వారి నందరిని ఆకర్షించాయి. ముఖ్యముగా "గంధర్వ చక్రవర్తి కూతురు" మామకు పన్నె తెచ్చినది.

—బి. లక్ష్మికుమారి, ఉయ్యూరు

"నిజంలాటి కల" అన్న కథ తప్ప తక్కిన కథలన్నీ బాగున్నాయి. ముఖ్యముగా "రామాయణము", "రాకాసిలోయ" లకు వేసిన బొమ్మలు ఆకర్షణీయంగా ఉన్నాయి.

—ఎస్. శ్రీనివాసమూర్తి, మద్రాసు

ఇండియన్
కెమెరా
<u>అమెరికాలో</u>
వేల
లెక్కను
కొన్నారు!



# అజయ్ '127'

## ప్రఖ్యాత చిన్న కెమెరా

అజయ్ యొక్క ప్రత్యేక లక్షణములు :
అందమైన బ్యాక్‌లైట్ కేసు • ప్రతి 127 ఫిల్ము రోలుకు 8 ఎక్స్‌పోజర్స్. • ప్రఖ్యాత అమెరికన్ ఆప్టికల్ కంపెనీ తయారు చేసిన F-15 ఫిక్స్‌డ్ ఫోకస్ గల మినిస్కస్ లెన్సు • పూల్‌ప్రూఫ్, సింగిల్ స్పీడ్ షట్టరు • ఫ్లాష్ సింక్రొనైజ్డ్ • హుడ్ గల ఐ-లెవెల్ రకపు వ్యూ-ఫైండరు.

PLAJOY TEL

రూ.24 మాత్రమే స్థానిక పన్నులు అదనము.
అజయ్ బహుమతి ప్యాక్ : అజయ్ '127' మరియు ఏస్ ఫ్లాష్‌గన్. రూ. 39/- స్థానిక పన్నులు అదనము.
వివరాలకు వ్రాయవలసిందిగా వర్తకులకు మనవి. పెద్ద ఫొటో వ్యాపారుల వద్ద దొరుకుతాయి, లేక
పటేల్ ఇండియా ప్రైవేట్ లి.,
బొంబాయి • ఢిల్లీ • కలకత్తా • మద్రాసు.



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

"చందమామ" వెల ఈ సంచిక నుంచీ 60 నయా పైసలకు పెరుగుతున్నది. ధర పెంచటం గురించి ఒక్క పాఠకుడు కూడా అభ్యంతరం చెప్ప లేదు. అనేకమంది తమ ఆమోదాన్ని కూడా తెలిపారు. ఇందుకు ఎంతైనా కృతజ్ఞులం.

ధర పెరుగుదలతోబాటు మార్పు లేమైనా చేస్తారా అని ఒకరిద్దరు అడిగారు. ప్రత్యేకించి చెప్పుకోదగిన మార్పు లేమీ లేవు. ఉన్న శీర్షికలనే సాధ్యమైనంత ఆకర్షవంతంగా ఉండేలాగు చూడటానికి కృషి చేస్తున్నాం. ఈ సంగతి మా పాఠకులు గుర్తిస్తూనే ఉన్నారు. ఇకముందు కూడా "చందమామ" పాఠకులకు శీర్షికల విషయంలో ఎలాంటి లోటూ రానివ్వమని మనవి.

సంపుటి : 32 - ఏప్రిల్ 1963 - సంచిక : 4



CHITRA



# భారత చరిత్ర



ఇల్తుత్మిష్ పెద్దకొడుకు నాసిరుద్దీన్ అనే వాడు 1229లో పోయాడు. అప్పటికింకా ఇల్తుత్మిష్ బతికే ఉన్నాడు. నాసిరుద్దీన్ బెంగాలులో రాజప్రతినిధిగా ఉంటున్నాడు. ఆయన కొడుకులలో మరెవరూ రాజ్యార్హులు కారు. అందుచేత ఇల్తుత్మిష్ తన కుమార్తె అయిన రజియ్యాను తనకు వారసురాలిని చేసి మరణించాడు. కాని సుల్తానుగారి కొలువులో ఉండే సామంతులకు ఆడదాని ముందు తల వంచటం అవమానమని పించింది. వారు సుల్తానుగారి కోరికను తోసి పుచ్చి ఆయన రెండో కొడుకును, రుక్నుద్దీన్ ఫీరూజ్ అనేవాణ్ణి సింహాసనం ఎక్కించారు.

రుక్నుద్దీన్ వట్టి అప్రయోజకుడు, నీచ భోగాలయందాసక్తి కలవాడు. వాడు పరిపాలనను గాలికి వదిలి ఖజానా ఖాళీ చేసేశాడు. తన కొడుకు అప్రయోజకత్వాన్ని ఆసరా చేసుకుని వాడి తల్లి షాతుర్ఖాన్ అధికారం హస్తగతం చేసుకున్నది; ఆమె మొదట్లో దాసీది. ఈ తల్లి కొడుకుల ఏలుబడిలో రాజ్యం అల్లకల్లోలమయింది. రాష్ట్రాలలో కేంద్ర ప్రభుత్వం పైన తృణీకారం ప్రబలింది. చివరకు ఢిల్లీలోని పెద్దలు సుల్తానునూ, అతని తల్లినీ పట్టుకుని ఖైదులో ఉంచారు. కిలోఖ్రీ అనే చోట తల దాచుకుంటూ ఉండిన రుక్నుద్దీన్‌ను కూడా పట్టి ఖైదు చేశారు. 1236 లో రుక్నుద్దీన్ ఖైదులోనే మరణించాడు.

రజియ్యా ఢిల్లీ సింహాసనం అధిష్ఠించింది. కాని ఆమెకు బలమైన ప్రతిపక్షం తయారయింది. దానికి నాయకుడు "ప్రధాని" ముహమ్మద్ జునైదీ. అయితే రజియ్యా సమర్థురాలు; రాజనీతిని తెలివిగా ఉపయోగపరిచి తన ప్రతి పక్షుల ఆట కట్టించింది. రాష్ట్రాలలో కూడా ఆమె పరిపాలనకు ఆదరం లభించింది. ఆమె పరి

## 19. రజియ్యా సుల్తాను





పాలన ఆరంభమైన రోజుల్లోనే కిరామితా, ములాహిదా అనే తెగలవారు నూరుద్దీన్ అనే తుర్కీవాడి నాయకత్వాన అరాజక చర్యలు తలపెట్టారు. వెయ్యిమంది కత్తులూ, డాళ్ళూ పట్టుకుని ఒక నిర్ణీత దినాన ఢిల్లీలోని పెద్ద మసీదులో ప్రవేశించారు. అయితే రాజభటులు వీరిని తరిమి కొట్టటంతో ఈ ప్రయత్నం హాస్యాస్పదంగా ముగిసింది.

అయినప్పటికీ రజియ్యాకు శాంతియుతంగా రాజ్యపాలన చేసే అవకాశం లేక పోయుంది. అబిస్సీనియాదేశపు బానిస, జలాలుద్దీన్ యాకూత్ అనేవాడు రజియ్యా అనుగ్రహానికి పాత్రుడు కావటం జరిగింది. ఆమె అతన్ని అశ్వశాలల అధిపతిగా నియమించింది. ఇది చూసి తుర్కీకులీనులకు ఆగ్రహం వచ్చింది. వారు ఐక్య ప్రతిఘటన సంఘటిత పరిచారు. సర్హింద్ గవర్నరైన ఇఖ్తియారుద్దీన్ అల్తూనియా అనేవాడు ముందుగా రజియ్యా సుల్తానుపై ఎదురు తిరిగాడు. ఇతడికి ఉన్నత రాజోద్యోగుల ప్రోత్సాహం ఉండింది.

ఈ తిరుగుబాటు అణచటానికి రజియ్యా పెద్ద సేనతో బయలుదేరింది. ఉభయ పక్షాలకూ జరిగిన సంఘర్షణలో జలాలుద్దీన్ యాకూత్ సంహరించబడ్డాడు. రజియ్యా తిరుగుబాటు దార్లకు బందీగా చిక్కింది. ఆమె అల్తూనియా అధీనంలో ఉంచబడింది. ఆమె సోదరుడు ముయిజుద్దీన్ బహ్రాం ఢిల్లీ సుల్తాను చేయబడ్డాడు.

తనకు ఏర్పడిన క్లిష్టపరిస్థితి నుంచి బయట పడటానికిగాను ఆమె అల్తూనియాను పెళ్ళాడి, అతన్ని తన పక్షం చేసుకున్నది. ఆమె తన భర్తతోనూ, అతని అనుచరుల తోనూ కలిసి ఢిల్లీ పైకి యుద్ధానికి బయలు దేరింది. అయితే ఆమె కైథల్ సమీపానికి వచ్చేసరికి అల్తూనియా పక్షంవారు నమ్మక ద్రోహం చేసి తప్పుకున్నారు. 1240 అక్టోబరు 13 న ముయిజుద్దీన్ బహ్రాం

రజియ్యాను ఓడించాడు. మర్నాడే రజియ్యానూ, ఆమె భర్తనూ చంపేశారు.

రజియ్యా ప్రతిభావంతురాలు. తండ్రి జీవించి ఉండగానే ఆమె రాజకీయ దక్షత సంపాదించింది. సింహాసనానికి వచ్చాక ఆమె సామర్థ్యం మరింత ప్రస్ఫుటమయింది. శత్రువులపై యుద్ధాలకు వెళ్ళేటప్పుడు ఆమె తాను ముందుండి సేనలను నడిపేది. స్త్రీల ఉడుపులు విసర్జించి పురుషుడి దుస్తులు ధరించి, తలపాగా పెట్టుకుని, బహిరంగంగా దర్బారులు జరిపి, తన పరిపాలనా దక్షతను చాటింది. తుర్కి సామంతులు ఒక స్త్రీకి లొంగి ఉండటం అవమానంగా భావించి ఆమెను అక్రమంగా తుదముట్టించారు.

రజియ్యా అనంతరం ఢిల్లీ నుంచి పరిపాలించిన ముయిజుద్దీన్ బహ్రాం, అలావుద్దీన్ మసూద్‌లు అసమర్థులు. వారి పరిపాలన సాగిన ఆరేళ్ళ కాలంలోనూ దేశంలో శాంతిగాని, సౌఖ్యంగాని లేదు. దేశ దౌర్భాగ్యానికి తగ్గట్టుగానే విదేశీయుల దాడులు ఆరంభమయాయి. 1241లో మంగోలులు పంజాబులో జొరబడి లాహోరు నగరాన్ని కొల్లగొట్టారు. 1245కు వారు ఉచ్ వరకూ వచ్చారు. వారిని తరమగొట్టటంలో చాలా నష్టం జరిగింది. మసూద్ షా పరిపాలనాంతంలో అశాంతి తారస్థాయి నందుకున్నది. 1246 జూన్ 10న ఢిల్లీలోని అమీర్లూ, మాలిక్‌లూ కలిసి ఇల్తుత్మిష్ చిన్న కొడుకును నాసిరుద్దీన్ మహమ్మద్ అనే వాణ్ణి సింహాసనం ఎక్కించారు.

నాసిరుద్దీన్ మరీ సౌమ్యుడు. రాజకీయ క్లిష్ట పరిస్థితిని ఎదుర్కొనే దక్షత అతనికి లేదు. ఆ పని సాధించిన వాడు అతని మంత్రి అయిన ఘియాసుద్దీన్ బల్బన్. అతనే రాజ్యంలోని అంతః కలహాలనూ, పైనుంచి మంగోలుల దండయాత్రలనూ అరికట్టాడు. 1266 ఫిబ్రవరి 18న నాసిరుద్దీన్ మరణంతో ఇల్తుత్మిష్ వంశం అంతరించింది.





# దాస్యవిముక్తి

చతుర్థాశ్వాసము :

గరుత్మంతుని చంక నిడుకొని,
కండ్ల నీళ్ళను తుడుచుకొను చా
వినత కద్రువ యింటికేగెను,
వెట్టిచాకిరి చేయసాగెను.

ఓర్పుగా ఆ మూలనుండియు
ఊడ్చవలె ఈమూల వఱకును ;
తెల్లవాఱెడులోన వాకిట
చల్లవలె కలయంపి నీళ్ళను.

అపుడు కద్రువ నిద్రలేచును,
అవులించును, ఒళ్ళు విఱుచును,
పంట గదిలో నున్న పాత్రలు
అంటుగిన్నెలు బయట పెట్టును.

వినత ఒక చిఱుచాప మీదను
తన కుమారుని నిద్రపుచ్చును ;
సవతి చెప్పిన పనులు చేయుచు
జాలిగా తన సుతుని చూచును.

తనదు దుస్థితి కామె వగచుచు
కనుల బొటబొట నీరు గార్చును ;
అంతలో తన సుతుని గుండెకు
అద్దుకొని పాలిచ్చుచుండును.

జ్యేష్ఠపుత్రు డనూరు డప్పుడు
చెప్పినది తలపోసికొని ఆ
వినత ఓర్పు వహించుచుండును,
పనులు చుఱుకుగ చేయుచుండును.

వినతకడ కేతెంచి కద్రువ
పనికి దొంగవు, నంగనాచివి,
ఊరకే కూర్చుంటి వేమని
ఒక్కొటొకటిగ పనులు చెప్పును.

సవతిచే వినతమ్మ ఇట్టులు
చదుములును ఒదిగిళ్ళు పడుచును,
ఎదురు చూచును తన కుమారుని
కెపుడు ఱెక్కలు వచ్చునో యని.

ఉత్పల సత్యనారాయణాచార్య



తన కుమారుని పైన, పాపము,
వినత ఆశలు పెట్టుకొన్నది ;
ఊడిగము తన సవతియింటను
ఓర్పుతో సాగించుచున్నది.

గగనమ్మున కెగురుటలో
గరుడుడు మిన్నందినాడు ;
అంతరిక్షయానమందు
యక్షుల నోడించినాడు.

ఒక్కనాడు నారదముని
ఎక్కడికో పోవుచు, విను
వీధిలోన గరుడుని కని,
వేగముగా దరికి వచ్చి—

"ఆగుమోయి గరుత్మంత!
ఆగుమాగు, మొక్క మాట
నీతో మాటాడవలయు ;
నిలువు మొక్క క్షణముపాటు."

అని నారదముని పలికిన
విని గరుడుడు నిలిచినాడు
వినయముతో శిరమువంచి
ముని వరునకు మ్రొక్కినాడు.

నారదముని దీవించుచు
నయమారగ ఇట్లు పలికె
"ఓయి! నీకు చెప్పదలచు
చున్నాడను ఒక్కమాట.

ఈ విధముగ వినతా సతి
ఇరువదేండ్లు గడపివైచె ;
గరుడుడు బలిశాలియగుచు
గగనమ్మున తిరుగసాగె.

తల్లి దాస్యమును గరుడుడు
తలపనైన తలపడయ్యె ;
కుఱ్ఱతనపు చేష్టలందు
కుతూహలము విడువడయ్యె.

నీలాకాశమ్ము నందు
నిడుద ఱెక్క లల్లార్చుచు ;
విలాసముగ గరుడు డెపుడు
విహరములు చేయుచుండు.

కశ్యపముని కొమరుండవు
కావున, నా కాప్తుండవు,
నీదు తల్లి పుణ్యవతిని,
నే నెఱుగుదునా సాధ్విని.

సవతాలికి దాస్యమ్మును
జరుపవలసి వచ్చె నామె;
దాస్యముకన్నను నరకము
ధాత్రిని ఇక ఏమున్నది?

కన్న కొడుకుపై ఆయమ
ఎన్నొ ఆశ లిడుకొన్నది;
తన దాస్యము కొడుకు తీర్చు
నను నమ్మికతో నున్నది.

తల్లి దాస్యమును తీర్పని
తనయుడుండి ఫలమేమిటి?
బానిసమును తొలగింపని
బలముండియు ఫలమేమిటి?"

అని నారదముని పలుకగ
విని గరుడుడు, 'ఓ స్వామీ!
ఈ దాస్యము మా తల్లికి
ఎట్లు కలిగె'నని అడిగెను.

ముని కద్రువ మోసమెల్ల
మొదటినుండి ఎఱిగించెను;
గరుడుడు విని హుంకరించి
కద్రువపై పగ పూనెను.




"పగ కిది సమయమ్ము కాదు,
పట్టుదలకు ఇది సమయము;
తల్లి దాస్యమును తీర్చిన
తరువాతనె అది సాధ్యము.

ధీరుడవై, సాటిలేని
శూరుడవై విక్రమించి,
పౌరుషమున తల్లి దాస్య
బంధములను తెగ త్రెంచుము.

నీ జన్మము ధన్యమగును,
నీ చరిత్ర ఈ ధరిత్రి
అదర్శప్రాయ మగును,
అఖిల జన శ్లాఘ్యమగును."

అని పలికిన, నారదముని
అడుగులపై సాగిలబడి
గరుడుడు, 'ఓ స్వామి! నాదు
కన్నులు తెఱపించినావు.

ఎన్ని బాధ లెదుర్కొనిన,
ఇంద్రాదులు అడ్డు పడిన,
ధైర్యముతో త్రిప్పి కొట్టి,
తల్లి చెఱను విడిపించెద.'

అనిన 'తథా' స్తనుచు మౌని
అంతలోన మాయమయ్యె;
ఱెక్కల నార్చుచు గరుడుడు
ఱివ్వున ఇంటికి వచ్చెను.

తల్లి పాదములకు మ్రొక్కి
తానేమియు మాటాడక
కద్రువకడ కేగినాడు,
గడుసరియై నిలిచినాడు.

గరుడుని కని కద్రువ ఒక
గద్దె మీద కూర్చున్నది;
ఇంచుక తడబాటు పడుచు
ఎందుకు వచ్చితివన్నది.

"తగిన మూల్య మిచ్చివేసి
తల్లి దాస్యమును తీర్పగ
వచ్చినాడ; అడుగుము, ఏ
వస్తువైన తేగలాడ."

గరుడుడిట్లు పలికినంత
కద్రూసతి మూతి త్రిప్పి,
'ఐతే స్వర్గమ్ము నుండి
అమృతమ్మును తెచ్చియిమ్ము'—

అనిన 'సరే'యని గరుడుడు,
అన్నమాట తప్పకుమని
మఱియొకపరి నొక్కి చెప్పి,
చెరచెర ఇంటికి వచ్చెను.—(సశేషం)






## 22

[కేశవుడూ, అతడి వెంటవున్న వాళ్ళకు, కేశవుడి ముసలితండ్రి, అతడి అనుచరుడు కోయ యువకుడూ కనిపించారు. కాని, అక్కడ నరభక్షకులతో జరిగిన యుద్ధంలో, తిరిగి ఎటువాళ్ళటు పారిపోయారు. కొండ శిఖరాన్ని చేరిన కేశవుడూ, అతడి అనుచరులకు ఒక మహా సర్పం, ఒక భయంకర మృగంతో చేస్తున్న పోరాటం కనిపించింది. తరవాత–]

కేశవుడూ, జయమల్లూ గుహలో ఏర్పడిన కంత నుంచి బయిటికి చూస్తూంటే, కోయ యువకుడు గుహలోని చీకటి కోణాలన్నీ వెతకసాగాడు. అతడికి ఒక మూల కొన్ని విల్లంబులు కనిపించినై. అతడికి ఎక్కడ లేని ధైర్యం కలిగింది. ఒక విల్లు చేతికి తీసుకుని, దానికి తాడు తగిలించి, అంబుల పొదిని భుజాన వేసుకుని, వాడు కేశవుడూ, జయమల్లుల దగ్గరకు వెళ్ళాడు.

జయమల్లు కోయయువకుడి కేసి ఆశ్చర్యంగా చూస్తూ, "గోమాంగ్! ఇవన్నీ ఎక్కడివి? బాణం ఎక్కుపెట్టుతున్నా వెందుకు? దానితో భయంకర మృగాన్ని చంపాలనుకుంటున్నావా?" అని అడిగాడు.

కోయగోమాంగ్ అవునన్నట్టు తలవూపి, బాణాన్ని వదలబోయేంతలో కేశవుడు చప్పున వెనుదిరిగి, అతడి చెయ్యి పట్టుకుని, "నువ్వు చెయ్యబోయేది చాలా ప్రమాద





కరమైనపని. నీ బాణం దెబ్బకు ఆ రెంటిలో ఏదీ చావకపోగా, అవి రెండూ కలిసి మన మీదికి విరుచుకుపడినా పడవచ్చు. వాటి నెందుకు రెచ్చగొట్టటం? అసలు ఈ విల్లం బులు నీ వెక్కడ సంపాయించావ్?" అని ప్రశ్నించాడు.

కోయగోమాంగ్ గుహలోని ఒక చీకటి మూలకు చేయి చూపాడు. కేశవుడు అక్కడికి పరిగెత్తి, ఒక విల్లూ, కొన్ని అంబులూ చేతికి తీసుకుంటూ, "ఇవి యీ సమయంలో మనకెంతో అవసరం. కత్తులు తప్ప అన్నీ పోగొట్టుకున్నాం. ఇక గుహ నుంచి బయటపడదామా?" అన్నాడు.

"ఈ బాణాలూ యివీ బహుశా, ఇక్కడ వున్న రెండు కంకాళాల తాలూకువయి వుంటవి. వీళ్ళిద్దరూ యిక్కడికి ఎందుకు వచ్చినట్టు? ఎలా మరణించినట్టు?" అన్నాడు జయమల్లు.

"ఆ ప్రశ్నకు జవాబు కనుక్కునేలోపల మనంకూడా వాళ్ళతో చేరిపోవలసి రావచ్చు. ఆ తరవాత మన వెనక వచ్చినవాళ్ళు, మన కంకాళాలను చూసి, యిలాంటి ప్రశ్నలే వేసుకుంటారు!" అన్నాడు కేశవుడు విసుగ్గా.

జయమల్లు ఏదో చెప్పబోయేంతలో, గుహ వెనకభాగం మీదికి, భయంకర మృగం, మహాసర్పం ఉప్పెనలా వచ్చి పడినై. వాటి తాకిడికి గుహ అంతా కంపించి పోయింది. కేశవుడూ, అతడి అనుచరులిద్దరూ గుహలో బోర్లాపడిపోయారు. గుహ మధ్య భాగం రెండుగా విచ్చిపోయి, ఫెళ ఫెళ మంటూ రాళ్ళూరప్పలూ అందులోకి దొర్లుకుపోయినై. కేశవుడూ, అతడి స్నేహితులు కూడా వాటి వెంట కింద అగాధం లోకి పడిపోయారు.

ముగ్గురికీ దెబ్బలు తగిలినై. శరీరమంతా రాళ్ళ మధ్య పడటంతో గీచుకుపోయింది. కాని, వాళ్ళ కత్తులూ, విల్లంబులూ వాళ్ళతో పాటు కింది అగాధంలోకి పడిపోయినై.



ముగ్గురూ ఒళ్ళు దులుపుకుంటూ లేచి నిల బడ్డారు. ఇంత ప్రమాదంలో చిక్కినా, ఏకాలో చెయ్యో విరగనందుకు, వాళ్ళు చాలా సంతోషించారు.

"మనం గొప్ప అదృష్టవంతులం!" అన్నాడు కేశవుడు.

"అందుకేం సందేహం! కాని, ఈ చీకటి కోన లోంచి బయటపడటం ఎలా? అదీ యిప్పటి సమస్య!" అన్నాడు జయమల్లు.

కోయగోమాంగ్, అగాధం వెంట కొంచెం దూరం మోకాళ్ళ మీద పాకిపోయి, ఒక మలుపు తిరిగి, "కేశవా, జయా! మనకు వచ్చిన ప్రమాదం ఏమీ లేదు. మనం కొండ పొట్టలోని గుహ కందరాల్లో చిక్కుకు పోయాం. కాని, ఎక్కడినుంచో కొంచెం వెలుగు వచ్చి పడుతున్నది. మనం సురక్షితంగా యిక్కణ్ణించి బయటపడొచ్చు," అన్నాడు. గోమాంగ్ మాటలు వింటూనే కేశవుడూ, జయమల్లూ ఆత్రంగా అతడున్న చోటుకు పరిగెత్తారు. వాళ్ళకూ అంత దూరానవున్న సొరంగంలో కొద్దిపాటి వెలుగు కనిపించింది. కాని, అది ఎటునుంచి వస్తున్నదో మాత్రం అర్థం కాలేదు.

"సరే, యిక మనం బయలుదేరుదాం. యిక్కడ ఎటు చూసినా గుహ మార్గాలు



కనిపిస్తున్నవి. దేని వెంట వెళితే, మనం బయలు ప్రదేశాన్ని చేరగలమో అర్థం కావటంలేదు," అన్నాడు జయమల్లు.

కేశవుడు మౌనంగా ముందుండి దారి తీశాడు. అతడికి తన ముసలితండ్రిని గురించిన దిగులుతోపాటు, యిప్పటి తన స్థితి కూడా దిగులు పుట్టిస్తున్నది. బహుశా, యిక్కడ అడ్డదిడ్డంగా వున్న సొరంగ మార్గాల్లో చిక్కుకుని, తనూ, తన స్నేహితులిద్దరూ మరణించవచ్చని కూడా అతడు భావించాడు.

ముందు నడుస్తున్న కేశవుడికి కొంత దూరం పోయిన తరవాత, హఠాత్తుగా




మార్గం రెండు మూడు వైపులకు చీలి పోవటం కనిపించింది. తను వాటిల్లో దేని వెంట వెళ్ళాలి? అన్న ప్రశ్న అతడికి ఎదురయింది. అతడి తటపటాయింపు గ్రహించిన వాడిలా వెనకవున్న జయమల్లు, "కేశవా! ఆలోచించేందు కేముంది? ముక్కుకు సూటిగా నడువు. ఈ కాస్త గుడ్డివెలుగు వున్నంతవరకూ, మనం నిరాశ చెందనవసరంలేదు," అన్నాడు.

జయమల్లు మాట ముగించేలోపల, ఎడమవైపునున్న సొరంగ మార్గాన్నుంచి కీచుమన్న వికృత ధ్వని వినిపించింది. ఆ వెంటనే రెక్కలల్లాడినప్పుడయే తపతప



మనే ధ్వనిలాటి శబ్దం వినబడింది. కేశవుడు చప్పున కత్తి దూసి మార్గం మలుపు తిరిగి నిశ్చేష్టుడయిపోయాడు. అతడి వెనకవున్న జయమల్లుకు కలిగిన ఆశ్చర్యం అంతా యింతా కాదు. కోయగోమాంగ్ 'దయ్యం' అంటూ కీచుమన్నాడు. జయమల్లు బిగ్గరగా నవ్వాడు. కేశవుడు తన అంబుల పొది కేసి చేయి పోనిచ్చాడు. గోమాంగ్, ఆ సరికే బాణం ఎక్కుపెట్టి వున్నాడు.

సొరంగ మార్గంపైన ఎగుడుదిగుడుగా వున్న రాళ్ళమీద నిలువెత్తునవున్న ఒక నల్లని ఆకారం తారట్లాడుతున్నది. ఆ గుడ్డి వెలుగులో కూడా ఆ ఆకారం నోటిపళ్ళు తళతళ మెరుస్తున్నవి.

"గోమాంగ్, అది దయ్యం కాదు, దయ్యపు గబ్బిలం! బాణం ఎక్కుపెట్టావు గదా, గురిగా దాని తలమీద తగిలేలాకొట్టు!" అన్నాడు జయమల్లు. అదే క్షణంలో గోమాంగ్ వదిలిన బాణం రివ్వుమంటూ వెళ్ళి, దయ్యపు గబ్బిలం తలను తాకింది. గబ్బిలం కీచుమంటూ అరిచి పల్లటీలు కొడుతూ కిందపడిపోయింది.

గోమాంగ్ ముందుకు వెళ్ళి గిలాగిలా కొట్టుకుంటున్న గబ్బిలాన్ని ఒక అంబుతో పొడిచి చూస్తూ, "అడవిలో పుట్టి అడవిలో



పెరిగిన వాణ్ణయినా, ఇంత పెద్ద గబ్బిలాన్ని నే నెన్నడూ చూడలేదు," అన్నాడు.

"ఆ మాట కొస్తే, నేనూ చూడలేదు. మన మేదో ఒక వింత ప్రపంచంలోకి వెళు తున్నామని నా అనుమానం," అన్నాడు జయమల్లు.

"బహుశా, యిదే రాకాసిలోయకు వెళ్ళే మార్గమేమో!" అన్నాడు కేశవుడు.

"మీకేమైనా అరుపులు... తోడేళ్ళ అరు పుల్లాంటివి, వినబడుతున్నావా?" అని ప్రశ్నించాడు, కోయగోమాంగ్.




కేశవుడూ, జయమల్లూ ఓ క్షణకాలం ఆగి, "అవును, ఏవో జంతువులు మొరుగు తున్న ధ్వని అస్పష్టంగా వినబడుతున్నది," అన్నారు ఆశ్చర్యంగా.

"అయితే యిక మనం బతికి బయట పడ్డట్టే. తోడేళ్ళున్నచోట, కావలసినంత వేట వుంటుంది. తినేందుకు కొల్లలు కొల్లలు!" అన్నాడు గోమాంగ్ ఉత్సాహంగా.

"ముందు మనం గజిబిజిగా వున్న, ఈ సొరంగమార్గాల నుంచి బయటపడ్డప్పుడు గదా, తిండి మాట," అన్నాడు కేశవుడు.

"నావి పాము చెవులు! నన్ను దారి తీయనీయండి. సూటిగా ఆ తోడేళ్ళ మంద మధ్యకి తీసుకుపోతాను," అంటూ గోమాంగ్ చెవులు రిక్కించి, తోడేళ్ళ అరుపులు ఏవైపు నుంచి వస్తున్నవో పసిగడుతూ ముందు నడవ సాగాడు. నాలుగైదు నిమిషాల కాలం సొరంగ మార్గాల్లో నడిచిన తరవాత, వాళ్ళకు హఠాత్తుగా ఒక గుహ వైపు నుంచి కళ్ళు మిరుమిట్లు కొలిపే వెలుగు కనిపించింది. ముగ్గురూ ఉత్సాహంతో ఎగిరి గంతులేశారు. గుహ బయట చిన్నచిన్న పొదలూ, కొంచెం దూరంలో పెద్దపెద్ద చెట్లూ వాళ్ళ కంట బడినై. తోడేళ్ళ అరుపులు కూడా మరింత దగ్గిరగా వినిపించసాగినై.

కేశవుడూ, అతడి అనుచరులూ వెలుగు వస్తున్న గుహ ద్వారం నుంచి బయటికి

వచ్చారు. గుహ ముందు ఒక పక్కగా సమతలంగా వున్న ప్రదేశంలో, పదీ పన్నెండు జింకలూ, కొన్ని లేళ్ళూ మందగా నిలబడి వున్నవి. వాటి చుట్టూ గుండ్రంగా తిరుగుతూ నాలుగు తోడేళ్ళు పెద్దగా అరుస్తున్నవి. తమను సమీపంచవచ్చే తోడేళ్లను, మెలితిరిగిన కొమ్ములు గల జింకలు కొన్ని తలలు వంచి పొడిచేందుకు ప్రయత్నిస్తున్నవి. "తోడేళ్ళను ఎదిరించే జింకలను, నేనెక్కడా చూడలేదు," అన్నాడు జయమల్లు.

"అది నీ దురదృష్టం. ప్రాణరక్షణకు, తోడేలును చంపిన కొండ గొర్రేను నేను చూశాను," అన్నాడు కోయగోమాంగ్. వాళ్ళి విధంగా మాట్లాడుకునేంతలో తోడేళ్ళ దృష్టి వాళ్ళమీద పడింది. అవి చప్పున జింకల చుట్టూ తిరిగేవల్లా ఆగి, కోరలు చాస్తూ, ఆ ముగ్గురికేసీ రాసాగినై. కేశవుడు బాణం ఎక్కుపెట్టి ఒక తోడేలును కొట్టాడు. బాణం గుండెల్లో తగలగానే, తోడేలు పెద్ద పెట్టున అరిచి, ఎగిరి అంత దూరాన పడింది. మిగతా తోడేళ్ళు భయంకరంగా మొరుగుతూ కేశవుడూ వాళ్ళున్న చోటుకు పరిగెత్తిరాసాగాయి. గోమాంగ్, జయమల్లు కూడా బాణాలు ఎక్కుపెట్టి వదిలారు. గోమాంగ్ దెబ్బకు మరొక తోడేలు కింద



పడింది. తతిమ్మా తోడేళ్ళు రెండూ ఒక్క క్షణం నిలబడి, తరవాత పెద్దగా మొరిగి, బండరాళ్ళ మీది నుంచి దూకుతూ అడవి లోకి పారిపోసాగినై.

కోయ గోమాంగ్ పెద్దగా నవ్వి, "అరె, జింకలూ, లేళ్ళూ ఎక్కడ?" అంటూ ఆశ్చర్యపడ్డాడు.

"నువ్వు చూడలేదా? అవి ఎప్పుడో పారి పోయినై. తోడేళ్ళ బారినుంచి తప్పుకుని, మన బారిన పడేందుకవేమీ తెలివి తక్కువవి కాదు," అన్నాడు కేశవుడు.

"నాకు చచ్చే ఆకలేస్తున్నది. దొరికితే ఒక లేడిని తినేయగలను," అన్నాడు గోమాంగ్.

"అందరికీ ఆకలిగానే వుంది. కాని, మనం మండూకుడూ, బ్రహ్మదండి అను చరుల్నుంచి ప్రమాదం రాకుండా చూసు కోవాలి. వాళ్ళు మన కోసం కొండలూ, గుట్టలూ గాలిస్తున్నారు," అన్నాడు జయమల్లు.

కోయ గోమాంగ్ చుట్టూ ఓమారు కలయ చూసి, "నన్నడిగితే, అసలిది నరభక్షకుల లంకే కాదంటాను. ఇక్కడి చెట్టూ చేమలూ, ఈ కొండ తీరూ అంతా భిన్నంగా వున్నది. ఏమంటావ్, కేశవా?" అన్నాడు.




కేశవుడు కూడా చుట్టూ పరీక్షగా చూసి, "మనం బహుశా, కొండ గుహల్లో కందరాల్లో పడి, మరో లంకకో, దేశానికో చేరినా చేరి వుండొచ్చు. అయినా, మన జాగ్రత్తలో మనం వుండాలి," అంటూ జయమల్లు కేసి తిరిగి, "మల్లూ, మా అయ్య నరభక్షకులకు దొరక్కుండా పారిపోయి వుంటాడంటావా?" అని ప్రశ్నించాడు.

"ఊఁ, అందుకు సందేహమా? మీ అయ్యకన్న జిత్తులమారిని నే నెక్కడా చూడలేదు. చెట్ల మీద వుండి, అంతమంది నరభక్షకుల్నీ ఎలా హడలకొట్టాడో చూశావు గదా? ఆ వెంట వున్న చిన్న గడేజంగ్

ధైర్యసాహసాల్లో సింహం అంటే నమ్ము," అన్నాడు జయమల్లు.

జయమల్లు మాటలతో కేశవుడికి కాస్త ఉత్సాహం కలిగింది. అతడు అడవి కేసి చూస్తూ, "మనం ముందు ఏదైనా ఆహారం సంపాయించాలి. నాకు దాహంకూడా అవుతున్నది. ఈ దగ్గిర్లో ఎక్కడో నీరుండక పోదు," అంటూ ముందుకు నడిచాడు.

ముగ్గురూ కొండ సమీపాన్నుంచి, నిశ్శబ్దంగా కదిలి అడవిలోకి నడవసాగారు. అప్పటికి సూర్యుడు కొంచెంగా పడమటి దిక్కుకు వాలాడు. ముగ్గుర్నీ ఆకలి బాధిస్తున్నది. చెట్లనేమైనా పళ్ళుగాని, తేనె తుట్టెలుగాని దొరుకుతవేమో అని గోమాంగ్ తల ఎత్తి పరీక్షగా చూస్తూ నడవసాగాడు. అట్లా నడుస్తున్న గోమాంగ్ హఠాత్తుగా ఒక కాలు భూమిలోకి గుచ్చుకుపోవటంతో పెద్దగా కేక పెట్టాడు. పక్కనే వున్న జయమల్లు అతడి జబ్బ పుచ్చుకుని వెనక్కు లాగాడు.

చూడటానికి సమతలంగా వున్న ఆ ప్రదేశంలో, ఏ కారణంవల్ల గోమాంగ్ ఊబిలో చిక్కుకున్నవాడిలా ముందుకు పడబోయాడో వాళ్ళకు అర్థంకాలేదు. కేశవుడు అక్కడ అడ్డదిడ్డంగా పడివున్న చెట్ల కొమ్మల్నీ, రెమ్మల్నీ తొలిగించాడు. దిగువను వాళ్ళకు ఒక గొయ్యి కనిపించింది. అందులో నిలువునా పాతివున్న గసిక కర్రల మీద ఒక పులి కొన వూపిరితో కొట్టుమిట్టాడుతున్నది.

"ఇది, మనుషుల కోసమో, జంతువుల కోసమో ఎవరో పెట్టిన మాటు. కాస్తలో ప్రమాదం తప్పుకున్నాం," అన్నాడు కేశవుడు. అదేసమయంలో అన్ని వైపులనుంచీ, రాళ్లూ, కర్రలూ వాళ్ళమీదకు జడివానలా వచ్చి పడసాగినై. కేశవుడూ, అతడి అనుచరులూ విల్లంబులు పైకెత్తి, భూమిమీద బోర్లా పడుకుని, చుట్టూ కలయ చూడసాగారు. ఎక్కడా మనిషి జాడ లేదు.

—(ఇంకా వుంది)



# అక్రమమైన శిక్ష

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా! చూడగా చూడగా నీ కెవరో పెద్ద శిక్ష విధించినట్టుగా నాకు తోస్తున్నది. ఈ ప్రపంచంలో నిరపరాధులు కూడా అక్రమంగా శిక్ష పొందుతారు. ఆ సంగతి స్పష్టం చేసే ఒక చిన్న కథ చెబుతాను విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు:

ఒక కుగ్రామంలో కన్నయ్య అనే పేద కుర్రవాడొక డుండేవాడు. వాడికి ప్రపంచంలో నా అన్నవారెవరూ లేరు. వాడు ఒక ధని కుడి ఇంట పని చేస్తూ, బుద్ధి తెలిసినప్పటి నుంచీ ఉదరపోషణ చేసుకుంటున్నాడు.

ఒకనాడు ధనికుడి ఇంటికి కొందరు బంధువులు యాత్ర చేసి వచ్చారు. వారు అనేక పుణ్యక్షేత్రాలు తిరిగి వచ్చి వాటిని

## బేతాళ కథలు





గురించి చెబుతుంటే కన్నయ్య కూడా ఎంతో ఆసక్తితో విన్నాడు. ముఖ్యంగా వాళ్ళు బృందావనం గురించి చెప్పిన మాటలు కన్నయ్య మనసులో బాగా నాటాయి. ఎలాగైనా బృందావనం వెళ్ళి అక్కడి స్థలాలన్నీ చూడాలని వాడి ప్రాణం కొట్టుకుపోయింది. "బృందావనం చూడని జన్మ ఎందుకు?" అనుకున్నాడు వాడు.

అయితే కన్నయ్య దగ్గిర చిల్లి గవ్వ లేదు. యాత్రలు చెయ్యాలంటే పుష్కలంగా డబ్బుండాలి, లేదా డబ్బు గల వాళ్ళ వెంట పెట్టుకుని వెళ్ళాలి. కన్నయ్య యజమాని తలుచుకుంటే ఎన్ని యాత్రలైనా చెయ్యగలడు, కాని ఆయనలో యాత్రలు చెయ్యాలన్న కోరిక ఏ మాత్రమూ లేదు. ఆయన తమ ఇంటికి వచ్చిన బంధువులతో కూడా, "ఎందుకొచ్చిన దేశాటన? దారి పొడుగునా దొంగల భయం! రోగం వస్తే చూసేవాళ్ళు కూడా ఉండరు. దేవుడు అంతటా ఉన్నాడు!" అన్నాడు.

కన్నయ్య ఎవరితోనూ చెప్పకుండా బృందావనం బయలుదేరాడు. తన దగ్గిర చిల్లి గవ్వ లేకపోయినా వాడు వెనకాడలేదు. ప్రయాణం సుఖంగా సాగకపోతే ఏం మునిగిపోయిందనుకున్నాడు వాడు. దారి పొడుగునా ధర్మ సత్రాలుంటాయి. పడుకునేటందుకు చోటూ, కడుపు కింత తిండీ దొరకక పోదు.

కొన్నిరోజులు ప్రయాణం చేసి కన్నయ్య ఒక రాత్రి ఒక సత్రంలో పడుకున్నాడు. ఆ రాత్రి ఆ సత్రంలో యాత్రికులు బొత్తిగా లేరు. మర్నాడు తెల్లవారుతూనే కన్నయ్య బయలుదేరుతూండగా సత్రం యజమాని వెనక్కి పిలిచి, "ఏమిరా? నీ సంచీ వదిలి వెళ్ళి పోతున్నావు! ఇంత అజాగ్రత్త అయితే ఎలా?" అని వాడి చేతికి ఒక సంచీ ఇచ్చి, "ఇక పద! నాకు వేరే పని ఉన్నది," అంటూ వెళ్ళిపోయాడు.

చాలాసేపు కన్నయ్యకు ఏమీ అర్థం కాలేదు. సత్రం యజమాని తన మీద దయ కొద్దీ దారిలో తినటానికి పిండి వంట లేమైనా సంచీలో పెట్టి ఇచ్చి ఉంటాడని మొదట అనుకున్నాడు. కాని సంచీ విప్పి చూస్తే అందులో బోలెడంత డబ్బూ, కొత్త పంచెలూ అవీ ఉన్నాయి. మరెవరో సత్రంలో వదిలిపోయిన సంచీ తనదనుకుని సత్రం యజమాని తన కిచ్చాడు. ఆయనకు సంచీ తిరిగి ఇచ్చేద్దామంటే సత్రం యజమాని సత్రానికి తాళం పెట్టి ఎటో వెళ్ళి పోయాడు. వెంటనే కాలు సాగించకపోతే సమయానికి పై మజిలీ చేరుకోలేడు.

"ఈ సంచీ మరిచిపోయినవాడు ఎక్కడైనా తటస్థ పడి సంచీ తనది అని గుర్తిస్తే వాడికి దాన్ని ఇచ్చేస్తాను," అనుకుని కన్నయ్య ముందుకు సాగాడు. అదృష్ట వశాత్తూ ఆ సాయంకాలమే వాడికి ఒక యాత్రికుల బృందం తగిలింది. వారిలో కొందరు బృందావనానికే పోతున్నారు. కన్నయ్య ఇక తనకు ప్రయాణం సుఖంగా సాగుతుంది గదా అని సంతోషించాడు.

యాత్రికులు కొంతదూరం వెళ్ళాక ఒక నది అడ్డంగా వచ్చింది. నది దాటించే పడవ రేవులో ఉన్నది. యాత్రికులందరూ దానిలో



ఎక్కి నది దాటి, దిగి పోయేటప్పుడు తలా ఒక కాసూ పడవవాడి చేతిలో పెట్టారు. కన్నయ్య మటుకు ఏమీ ఇవ్వలేదు. ఇదేమని పడవ వాడడిగితే తాను నిరుపేదననీ, తన దగ్గిర చిల్లి గవ్వకూడా లేదనీ వాడు చెప్పాడు. కాని కన్నయ్యతోటి యాత్రికులు, "సంచీలో అంత డబ్బు గలగల లాడుతుంటే కానీ లేదంటావేమిటి?" అన్నారు.

ఒకడు చొరవగా కన్నయ్య చేతి సంచీ లాక్కుని విప్పి చూసి, "ఇందులో డబ్బులే కాదు, మంచి బట్టలు కూడా ఉన్నాయి. మనవాడు చింకి బట్టలు కట్టుకుని డబ్బు లేదంటున్నాడు. పరమ లోభి లాగున్నాడు!"



అన్నాడు. మరికొందరు మంచివాళ్ళు, దొంగల భయం కొద్దీ కన్నయ్య పేదతనం నటిస్తున్నా డనుకుని, "నీ కేమీ ఫరవాలేదు. మంచి బట్టలు కట్టుకో. డబ్బు తీసి ధారాళంగా ఖర్చు పెట్టుకో. ఇంత మందిమి ఉండగా దొంగలేం చేస్తారు?" అన్నారు. కన్నయ్య ఏమీ చెప్పలేని స్థితిలో ఉండటంచేత మంచి బట్టలు కట్టుకుని, అందరిలాగే డబ్బు ఖర్చు పెడుతూ యాత్ర సాగించాడు. సంచీ పోగొట్టుకున్నవాడు ఇక తనకు కనపడతా డన్న నమ్మకం కూడా పోయింది.

కన్నయ్య తీర్థయాత్ర చాలా చక్కగా జరిగింది. సంచీలో డబ్బున్నమటుకు చేయ వలసిన ఖర్చులన్నీ చేశాడు. బృందావనంలో తాను చూడదలుచుకున్న స్థలాలన్నీ చూసి పరమానందభరితుడయాడు. తాను వచ్చిన పని తృప్తికరంగా నెరవేరిందనిపించాక వాడు తన గ్రామానికి తిరిగి ప్రయాణం అయాడు.

కన్నయ్య తిరుగు ప్రయాణంలో అదే సత్రం దగ్గిర దిగేసరికి అక్కడ ఒక మనిషి వాడి చేతిలోని సంచీ చూసి, "అదే నా సంచీ! నా బట్టలు కూడా కట్టుకున్నావు! నా డబ్బంతా ఏం చేశావు చెప్పు!" అని కన్నయ్యను నిలవేశాడు.

సంచీలో డబ్బంతా అదివరకే ఖర్చయి పోయింది. ఆ సంచీ తన కెలా వచ్చిందో కన్నయ్య చెప్పబోతే ఆ మనిషి వినిపించుకో లేదు. "నీవు చెప్పేదంతా నా కనవసరం. నా డబ్బు రెండువందల రూపాయలూ నా కిచ్చెయ్యి. లేకపోతే న్యాయాధికారి వద్దకు నడు!" అన్నాడు.

విధిలేక కన్నయ్య న్యాయాధికారి వద్దకు వెళ్ళాడు. సంచీ పోగొట్టుకున్న మనిషి న్యాయాధికారితో తాను ఫలానా సత్రంలో తన సంచీ మరిచి పోయాననీ, తిరిగి వచ్చి చూసుకుంటే దాన్ని ఎవరో కాజేశారనీ, ఇప్పుడా మనిషి దొరికాడనీ చెప్పాడు. అలాగే కన్నయ్యకూడా తనకా సంచీ దొరికిన

వైనమూ, డబ్బు ఖర్చయిపోయిన వైనమూ న్యాయాధికారితో చెప్పాడు.

ఇద్దరు చెప్పినదీ విని న్యాయాధికారి, "ఈ మనిషి డబ్బు నీ యాత్రల కింద ఖర్చయినట్టు నీవే ఒప్పుకుంటున్నావు గనక ఆ బాకీ తీర్చటం నీ విధి. నీవు నిరుపేదవూ, కష్టజీవివీ గనక నీవు రెండేళ్ళపాటు ఈ పెద్ద మనిషి దగ్గిర పాలెగాడుగా పని చేసేటట్టూ, ఆయన నీకు తిండి పెట్టేటట్టూ నిర్ణయిస్తున్నాను," అన్నాడు. కన్నయ్య ఆ ప్రకారమే రెండేళ్ళు ఆ పెద్ద మనిషి దగ్గిర పని చేసి ఋణ విముక్తి పొందాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, కన్నయ్య ఏ తప్పు చెయ్యటం చేత ఈ శిక్ష అనుభవించాడు? వాడు చేసినది తప్పే అనుకున్నట్టయితే వాడికి యాత్రా ఫలం దక్కిందా? ఈ సందేహానికి సమాధానం తెలిసికూడా చెప్పక పోయావో నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "న్యాయాధిపతి ఎదటికి రాక పూర్వమే కన్నయ్య తన యాత్రా ఫలాన్ని పూర్తిగా దక్కించుకున్నాడు. వాడు కోరిన ఆనందం వాడికి బృందావనంలోనే దక్కింది. రెండేళ్ళపాటు సంచీ గల వాడి వద్ద జీతం లేకుండా పని చెయ్యమనటం కన్నయ్యకు శిక్ష కాదు. వాడు బుద్ధి తెలిసినప్పటి నుంచీ ధనికుడి ఇంట సేవ చేసికూడా ఒక్క చిల్లి గవ్వ వెనక వేసుకోలేక పోయాడంటే వాడికి జీవితమే ఒక శిక్ష అన్నమాట. రెండేళ్ళపాటు ఈ మనిషికి పాలెగాడుగా పని చెయ్యకపోతే ఆ ధనికుడి ఇంటనైనా పొట్ట కోసం వాడు పని చెయ్యక తప్పదు. అందుచేత న్యాయాధికారి వాడికి విధించినది శిక్ష కాదు. వాడు చేసిన తప్పుకూడా ఏమీ లేదు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. —(కల్పితం)





# గంధర్వ చక్రవర్తి కూతురు

## 3

చక్రవర్తి కూతురు తన గదికి చేరిసట్టు హసన్ చెప్పగానే అతని "అక్క" ఆమె వద్దకు వెళ్ళి, ఆమె పాదాల పైన పడి, "మహారాణీ, తమరాక వల్ల మా మందిరం పావన మయింది," అన్నది.

విచారసాగరంలో ఉన్న చక్రవర్తి కుమార్తె తల ఎత్తి ఆమెను చూసి, "నీవేనా? మానవ మాత్రుడెవడో నీ ప్రభువు కుమార్తెను ఇలా అవమానించటానికి అవకాశం ఇస్తావా? అసలు ఒక మనిషిని నీ యింట ఎలా చేరనిచ్చావు? ఏమి నీ ధైర్యం? నీ సహకారం లేకుండానే అతను నా సరస్సు వద్ద పొంచి ఉండి నన్ను పట్ట గలుగునా?" అన్నది.

హసన్ అక్క, "దేవీ, ఈ యువకుడైనా సామాన్యుడు కాడు. అతనికి ఈడొచ్చే మానవ మాత్రుడు లేడు. అతని శీలం అత్యద్భుతమైనది. అతని మనసులో దురుద్దేశం మచ్చుకైనా లేదు. విధి ప్రేరితుడై అతను నిన్ను గాఢంగా ప్రేమించటం జరిగింది. దైవ నిర్ణయాన్ని ఎవరు మార్చ గలరు? ప్రేమికులు క్షంతవ్యులు. అతని ప్రేమలాటి ప్రేమను నీవైనా తోసి పుచ్చ రాదు. అతను నిన్ను మొదటిసారి చూసినాక ప్రేమోపహతుడై ప్రాణాలు వదిలే దశకు వచ్చాడంటే నమ్ము! నీ వెంట సాటిలేని అందగత్తెలు మరి తొమ్మిది మంది ఉన్నప్పటికీ అతని మనసును నీవు మాత్రమే ఆకర్షించ గలిగావు," అన్నది.

ఈ సంగతి విన్నాక చక్రవర్తి కుమార్తె తనకు విమోచనం ఉండదని గ్రహించి ఒక్క నిట్టూర్పు విడిచింది.

సి. మాధవరావు



హసన్ అక్క ఆమెకు మంచి దుస్తులు కట్టబెట్టి, భోజనం వడ్డించి, ఆమె విచారాన్ని తగ్గించటానికి చేయదగిన ప్రయత్నాలన్నీ చేసింది. చివరకు చక్రవర్తి కుమార్తె, "నాకు మా తండ్రి నుంచీ, జన్మస్థలం నుంచీ ఎడబాటు విధించి ఉన్నది కాబోలు! విధిని ఎలా తప్పించుకోవటం?" అన్నది.

తమ చక్రవర్తి కుమార్తెకు కొంత ఉపశమనం కలిగించి అక్క హసన్ వద్దకు వచ్చి, "నీ ప్రియురాలి మనసును నీకేసి తిప్పుకో. ఆమెకు చూపవలసిన మర్యాదలన్నీ చూపు. ఆమెతో మాట్లాడేటప్పుడు సౌజన్యం ప్రదర్శించు," అని హెచ్చరించింది.

హసన్ చక్రవర్తి కుమార్తె వద్దకు వచ్చి ఆమె ఎదట నిలబడగానే చక్రవర్తి కూతురు అతన్ని ఆ పాదమస్తకమూ పరిశీలించి, అతని అపూర్వ సౌందర్యం గమనించి కొంతవరకు మెత్తబడింది. హసన్ ఆమెతో, "రాజకుమారీ, నేను నీ బానిసలాటి వాణ్ణి. ఏ విధంగానూ నిన్ను బలాత్కరించాలనే ఉద్దేశం నాకు ఏ కోశానా లేదు; శాస్త్ర విధి ననుసరించి నిన్ను వివాహం చేసుకోవాలనే నా కోరిక. పెళ్ళి అయినాక మనము నా జన్మ స్థలమైన బాగ్దాదునగరానికి పోదాము. నీకు కావలిసినంతమంది దాస దాసీలను ఏర్పాటు చేస్తాను. అక్కడ మా అమ్మ ఉన్నది. ఆమెను మించిన యోగ్యురాలు ప్రపంచంలో ఉండబోదు. ఆమె నిన్ను తన కుమార్తెలాగా చూసుకుంటుంది. ఆమె వంట అద్వితీయమైనది; నీకు దివ్యమైన భోజనం చేసి పెడుతుంది," అన్నాడు.

చక్రవర్తి కుమార్తె అతనికి జవాబు ఏమి చెప్పేదోగాని ఈ లోపుగా ముఖద్వారం తట్టిన చప్పుడు వినపడింది. అది తెరిచే పని తనది కావటంచేత హసన్ పరిగెత్తి వెళ్ళి తలుపు తెరిచాడు. వచ్చినవారు పెద్ద అక్కలు. వారు అరుగురూ వేట నుంచి తిరిగి వచ్చి, హసన్‌లో కలిగిన మార్పు

గమనించారు. హసన్ వారితో చక్రవర్తి కుమార్తె విషయం చెప్పక, వారు కొట్టి తెచ్చిన వేట లన్నిటినీ లోపలికి చేరవేశాడు.

పెద్ద అక్క అతన్ని చూసి, "ఏం, హసన్? ఇవాళ చాలా ఉత్సాహంగా ఉన్నావు! ఏదో కారణం ఉండాలే, ఏమిటది?" అని అడిగింది. హసన్ సిగ్గు పడి, అప్పుడే వచ్చిన చిన్న అక్కకేసి, "నువు చెప్పు!" అన్నట్టుగా చూశాడు.

"మరేమీలేదు. మన హసన్ ఇవాళ ఒక పిట్టను పట్టుకున్నాడు. దాన్ని మచ్చిక చేసి పెట్టాలి," అన్నది చిన్నక్క.

"ఈ భాగ్యానికే సిగ్గుపడి పోతాడేం?" అన్నది పెద్దక్క.

"అతని కా పిట్ట మీద ఎంత ప్రేమో చెప్పతరం కాదు," అంటూ ఆమె తన అక్కలకు జరిగినదంతా చెప్పేసింది. వారందరూ వెంటనే చక్రవర్తి కూతురున్న చోటికి వెళ్ళి ఆమెకు జోహర్లు చేసి, హసన్‌ను పెళ్ళాడమని ఆమెను ప్రోత్సహించారు. వారే హసన్ చేతిలో ఆమె చెయ్యి పెట్టి పాణిగ్రహణం కూడా చేశారు.

నూతన దంపతులు నలభైరోజులు అక్కడ గడిపినాక హసన్‌కు కలలో తల్లి కనిపించి, తనను మరిచిపోయినందుకు



అతన్ని చివాట్లు పెట్టింది. అతను పెద్ద పెట్టున మూలుగుతూ, కన్నీరు కారుస్తూ నిద్రనుంచి లేచాడు. ఏమి జరిగిందోనని అక్క లందరూ గాభరా పడి పరిగెత్తు కొచ్చారు. హసన్ భార్యకు కూడా అతని దుఃఖానికి కారణం తెలియలేదు.

హసన్ తన కల గురించి చెప్పినాక అతని చిన్నక్క "ఇక నిన్ను ఇక్కడ ఉండ నివ్వటం భావ్యం కాదు. మీ అమ్మ వద్దకు వెళ్ళు! కాని ఏటా వచ్చి మాతో కొంత కాలం వుంటానని మాట ఇయ్యి!" అన్నది.

ప్రయాణ సన్నాహమంతా పూర్తి అయాక వెళ్ళటం ఎలాగన్న సమస్య వచ్చింది.



బెహ్రాం తాలూకు డప్పు హసన్‌కు జ్ఞాపకం వచ్చింది. ఆ డప్పు ఎలా మోగించాలో అతనికి చిన్నక్క నేర్పింది. దాన్ని మోగించగానే అంతులేని ఒంటెలూ, గుర్రాలూ, కంచర గాడిదెలూ దూకుతూ వచ్చి సోల్పుగా నిలబడ్డాయి. వాటిలో ఉత్తమమైన వాటిని అవసరమైన మేరకు ఉంచేసి మిగిలిన వాటిని పంపేసిన మీదట హసన్ తన అక్కలిచ్చిన బహుమానాలన్నీ పుచ్చుకుని, వారికి వీడ్కోలు చెప్పి, తన భార్య అయిన గంధర్వ చక్రవర్తి కుమార్తెతో సహా ఇంటికి బయలుదేరాడు. ప్రయాణం శరవేగంతో సాగి శీఘ్రంగానే ముగిసింది.

హసన్ బస్రానగరంలో తన ఇంటి ముందు దిగుతూండగానే లోపలి నుంచి అతని తల్లి చేసే రోదనం వినిపించింది. అతను కూడా కన్నీరు కార్చుతూ తలవాకిలి తలుపు తట్టాడు. హసన్ తల్లి లేచి వచ్చి తలుపు తెరిచి, తన కొడుకును చూస్తూనే పెద్దగా నిట్టూర్పి మూర్ఛపోయింది.

హసన్ తన భార్యతో సహా తల్లికి ఉపచారాలు చేసి శీఘ్రంగానే స్పృహ కలిగించాడు. అతను తన భార్యను ఆమెకు పరిచయం చేశాడు. తన కోడలిని చూసుకుని ఆమె పరమానందం పొందింది. ఆ కోడలు గంధర్వ చక్రవర్తి కూతురని తెలిసి ఆమెకు మతిపోయినట్టయింది. ఇలాటి కోడలికి ఎలాటి మర్యాదలు జరపాలో కూడా ఆమెకు పాలుబోలేదు.

ఆవిడ అప్పుడే బయలుదేరి వెళ్ళి దుకాణాలలో ఉన్న బట్టలలోకెల్లా మేలయినవి పది ఏరి, కొని తెచ్చి, అన్నిటినీ ఒక్కసారే తన కోడలి పైన కప్పింది. తరవాత ఆమె తనకు తెలిసిన గొప్ప వంటకాలన్నీ చేసి స్వయంగా కోడలికి తినిపించింది.

చివరకు ఆమె తన కొడుకుతో, "నాయనా, నీ భార్య ఉండటానికి ఈ బస్రానగరం ఎంత మాత్రమూ తగదురా. ఇక్కడ

మనం పేదగా బతికినవాళ్ళం కూడానూ. అందుచేత మనం వెంటనే మన మకాం బాగ్దాదుకు మార్చి, గొప్ప అమీర్ల మని చెప్పుకు బ్రతుకుదాం," అన్నది.

ఈ ఆలోచన హసన్‌కు కూడా నచ్చింది. అతను తన ఇంటిని సామానుతో సహా విక్రయం చేసి, తన దగ్గిర ఉన్న డబ్బు సహాయంతో బాగ్దాదు చేరాడు. అతను నగరంలోకి వెళ్ళి దళార్ల ద్వారా ఒక దివ్య మైన భవనాన్ని లక్ష దీనారా లిచ్చి కొన్నాడు. ఆ ఇంటికి తగ్గట్టుగా సామగ్రి, అలంకర ణలూ ఏర్పాటుచేసి, అందులో తన భార్య తోనూ, తల్లితోనూ ప్రవేశించాడు. అతను ఎంత మంది దాసదాసీలను కొన్నాడంటే అతని పరివారాన్ని మించిన పరివారాలు బాగ్దాదులో ఎన్నో లేవు. అతను భోగభాగ్యా లతో తులతూగుతూ బాగ్దాదులో తొమ్మిది మాసాలు గడిపినాక అతని భార్య కవల పిల్లలను కన్నది. ఇద్దరూ మగబిడ్డలే, పున్నమి చంద్రుళ్ళలాటి వాళ్ళు. వారికి నాసిర్, మన్సూర్ అని పేర్లు పెట్టుకున్నారు.

ఏడాది పూర్తి కాగానే హసన్ తన చిన్న క్కకు ఇచ్చిన మాట జ్ఞాపకం తెచ్చుకుని ప్రయాణ సన్నాహం సాగించాడు. తన అక్కలందరికి కానుకలుగా ఇవ్వదగిన వస్తువులు కొన్నాడు. తల్లితో తన ప్రయాణం



గురించి చెప్పి, "అమ్మా, అన్నిటికన్న ముఖ్యమైన సంగతి విను. నీ కోడలి పక్షి తొడుగు రహస్యస్థలంలో దాచి ఉంచాను. నేను తిరిగి వచ్చేదాకా దాన్ని ప్రాణంతో సమంగా కాపాడాలి. నీ కోడలికి కొంత పక్షి స్వభావం ఉన్నది. పొరపాటునగాని ఆమె ఆ తొడుగును చూసిందో, మిగిలిన బంధాలన్నీ కూడా ఆమెను నివారించలేవు; ఆమెకు ఎగరాలన్న కాంక్ష ప్రబలంగా కలుగుతుంది. ఆమె వెళ్ళిపోతే మరి తిరిగి రాదు. ఆమె పోతే నేను మనోవ్యాధితో మరణించటం నిశ్చయం. నిత్య విషయాలలో కూడా ఆమెను శ్రద్ధగా చూసుకో. ఆమె గారాబంగా పెరిగినది, ఉపచారాలు మరిగినది. నేను చెప్పే ఈ విషయాలు పొరపాటున కూడా వీమరవద్దు," అన్నాడు.

"నా కింతగా చెప్పాలా, నాయనా? వయసు వచ్చి నా బుద్ధి పెడతల పట్టిందనుకున్నావా ఏం? నీవు నిశ్చింతగా వెళ్ళిరా. నేను నీ భార్యను ఎలా చూసుకోవాలో అలా చూసుకుంటాను. నే నడిగేదల్లా ఒకటే: వీలయినంత త్వరగా మటుకు తిరిగిరా," అన్నది తల్లి.

అయితే, పాపం, రానున్నది వారిద్దరూ ఎరగరు. తమ సంభాషణను చక్రవర్తి కుమార్తె విన్న సంగతి కూడా వారికి తెలీదు.

హసన్ తన భార్యనూ, ఆమె వద్దనున్న చంటిపిల్లలనూ ముద్దాడి ప్రయాణమై వెళ్ళిపోయాడు.

అతను రాగానే గంధర్వ రాజకుమార్తెలు అంతులేని ఆనందం పొందారు. ముఖ్యంగా చిన్నక్క సంతోషం చెప్ప నలవికాదు. ఆమె తమ భవనాన్ని పూలమాలలతోనూ, రంగు దీపాలతోనూ అలంకరించింది. హసన్ ఆమెతో తన కవలబిడ్డలను గురించి చెప్పాడు. తన అక్కలతో సరదాగా వేటకు వెళ్ళాడు. వారితో కలసి అంతులేని వేడుకలన్నిటా పాల్గొన్నాడు. (ఇంకా వుంది)






# అష్టావక్రుడు

పూర్వం ఏకపాదుడనే బ్రాహ్మణుడుండే వాడు. ఆయన భార్య సుజాత.

ఏకపాదుడి దగ్గిర శిష్యులుండేవారు. ఆయన వారి చేత అంతులేని అధ్యయనం చేయించేవాడు.

చాలా కాలానికి సుజాత గర్భవతి అయింది. ఒకనాడు ఆమె గర్భంలో ఉన్న శిశువు ఏకపాదుడితో, "ఎందుకు వాళ్ళను అధ్యయనంతో చంపుకు తింటున్నావు? నిద్రాహారాలు కూడా లేక నీ శిష్యులు బాధ పడుతున్నారు," అన్నాడు.

ఏకపాదుడికి కోపం వచ్చింది; "అధ్యయనం గురించి వక్రంగా మాట్లాడావు గనక నీవు ఎనిమిది వంకరలతో పుట్టు!" అని తన భార్య గర్భంలోని శిశువును శపించాడు.

. సుజాతకు ప్రసవకాలం సమీపించింది. ఇంట ఒక్క వస్తువు కూడా లేదు. జనక రాజు నడిగి ధనం తెచ్చుకుందామని ఏకపాదుడు వెళ్ళేసరికి అక్కడ వరుణుడి కొడుకు వంది అనే వాడున్నాడు. ఈ వంది రాజసభకు వచ్చిన వారందరినీ వాదానికి పిలిచి, తనతో వాదించి ఓడిపోయిన వారందరినీ నీటిలో ముంచి వేయిస్తున్నాడు. ఏకపాదుడికి కూడా ఈ గతే పట్టింది. ఆయన వందితో వాదించి ఓడిపోయాడు. ఆయనను నీటిలో ముంచి ఉంచారు.

కాలక్రమాన సుజాత తన అన్న అయిన ఉద్దాలకుడి ఇంట ఎనిమిది వంకరలు గల కొడుకును కన్నది. అతనికి అష్టావక్రుడని పేరు పెట్టారు. ఉద్దాలకుడికి ఇంచుమించు అదే సమయంలో ఒక కొడుకు కలిగాడు. వాడి పేరు శ్వేతకేతుడు. ధనార్జనకని బయలుదేరి వెళ్ళిన భర్త తిరిగి రాకపోవటం చేత సుజాత కొడుకుతో సహా ఉద్దాలకుడి ఇంటనే ఉండిపోయింది. అష్టావక్రుడు మేనమామ ఇంటనే పెరుగుతూ శ్వేత



కేతుడితో బాటు గురువు వద్ద చదువుకుంటూ ఉండేవాడు.

ఒకనాడు అష్టావక్రుడు ఉద్దాలకుడి తొడ మీద కూచున్నాడు. ఆ సమయంలో శ్వేతకేతుడు వచ్చి, "మా నాయన తొడ మీద కూచోవటానికి నీ వెవడవు? కావలిస్తే మీ నాయన తొడమీద కూచో," అని అసూయతో అన్నాడు.

ఈ మాటలు విని అష్టావక్రుడు తల్లి దగ్గిరికి వెళ్ళి, "అమ్మా, మా నాయన ఎక్కడ ఉన్నాడు?" అని అడిగాడు.

"నాయనా, నీవు పుట్టక ముందే ఆయన డబ్బు సంపాదించుకు వస్తానని జనకరాజు దగ్గిరికి వెళ్ళి ఇంతవరకు తిరిగి రాలేదు," అని తల్లి అష్టావక్రుడితో అన్నది.

ఈ మాట వింటూనే అష్టావక్రుడు తన తండ్రిని తీసుకురావటానికి జనకరాజు పట్టణానికి బయలుదేరి వెళ్ళాడు. అక్కడ అతనికి, తన తండ్రి వంది అనే వాడితో వాదించి ఓడిపోయి నీటి మధ్య ఉంచబడిన సంగతి తెలిసింది. అష్టావక్రుడు రాజసభకు వెళ్ళి వందిని వాదనకు పిలిచాడు. ఇద్దరూ వాదించుకున్నారు. వాదంలో వంది ఓడి పోయాడు. గెలిచినందుకు బహుమానంగా అష్టావక్రుడు తన తండ్రినీ, వంది చేత ఓడి పోయిన వారందరినీ కూడా నీటి నుంచి బయటికి తీయించాడు.

* * *

అష్టావక్రుడికి పెళ్ళి యీడు వచ్చింది. వదాన్యుడనే మునికి సుప్రభ అనే కుమార్తె ఉన్నది. అష్టావక్రు డామెను పెళ్ళాడగోరి, వదాన్యుడి వద్దకు వెళ్ళి తన కోరిక తెలిపాడు. వదాన్యుడు అష్టావక్రుడికి ఒక పరీక్ష పెట్టాడు.

"నా కూతురిని నీ కిచ్చి చెయ్యటానికి అభ్యంతరం లేదు గాని ముందుగా నీవు ఉత్తరంగా వెళ్ళి రావాలి," అన్నాడు వదాన్యుడు.

"ఉత్తరంగా ఎంత దూరం వెళ్ళాలి? ఎక్కడికి వెళ్ళాలి?" అని వదాన్యుణ్ణి అష్టావక్రు డడిగాడు.

"ఉత్తరంగా వెళితే కుబేరుడి అలకా నగరం వస్తుంది. అది దాటిపోతే హిమాలయాల మీద గౌరీ శంకరులు విహరించిన స్థలం వస్తుంది. అదికూడా దాటి ఇంకా ఉత్తరంగా పోతే ఒక స్త్రీ కనిపిస్తుంది. ఆమెను చూసి నీవు తిరిగి వచ్చెయ్యి," అన్నాడు వదాన్యుడు.

అష్టావక్రు డిందుకు సమ్మతించి ఉత్తరాభిముఖుడై ప్రయాణించాడు. అతను కుబేరుడి నగరాన్ని చేరుకునేసరికి కుబేరుడు స్వయంగా ఎదుట వచ్చి, తన ఇంటికి తీసుకుపోయి ఆతిథ్య మిచ్చాడు. అక్కడ అష్టావక్రుడు రంభా, ఊర్వశీ, తిలోత్తమలు చేసే నృత్యగాన ప్రదర్శనాలు చూస్తూ ఒక సంవత్సరం గడిపి, కుబేరుడి వద్ద సెలవు పుచ్చుకుని హిమాలయాల మీదుగా ప్రయాణం చేసి ఒక వనాన్ని చేరుకున్నాడు.

ఆ వనం మధ్య ఒక బంగారు భవనమూ, దాని చుట్టూ అనేక ఇతర భవనాలూ ఉన్నాయి. అష్టావక్రుడు బంగారు భవనంలో ప్రవేశించగానే అనేకమంది స్త్రీలు వచ్చి అతణ్ణి లోపలికి తీసుకుపోయారు. లోపలి నుంచి అప్సరసలను మించిన అందగత్తె



ఒకతె వచ్చి అతనికి అతిథ్య మిచ్చింది. ఆ రాత్రి ఆమె అతన్ని మోహపాశంలో బంధించటానికి విశ్వ ప్రయత్నం చేసింది. కాని అష్టావక్రుడు లొంగక, "నేను బ్రహ్మ చర్య దీక్షతో ఉన్నవాణ్ణి. నన్ను వది లెయ్యి," అని ఆమెను వేడుకున్నాడు.

మర్నాడు ఆమె అతనికి తలంటి నీళ్ళు పోయించి, "నన్ను పెళ్ళి చేసుకో," అన్నది.

"చూస్తే పసిదానివి లాగున్నావు; నీ పెళ్ళి నీ తండ్రో నీ అన్నో చెయ్యాలిగద! నిన్ను నీవే కన్యాదానం ఎలా చేసుకుంటావు? అసలు నీ వెవరో ముందు చెప్పు!" అని అష్టావక్రు డామెను అడిగాడు.

ఆమె నవ్వి, "నేను ఉత్తర దిక్కును. నిన్ను పరీక్షించటానికి వదాన్యుడు నన్ను నియోగించాడు. పరీక్షలో నీవు నెగ్గావు. ఇక ఇంటికి తిరిగి వెళ్ళి సుప్రభను పెళ్ళాడి సుఖంగా ఉండు," అన్నది. అష్టావక్రుడు తిరిగి వెళ్ళి సుప్రభను పెళ్ళాడాడు.

ఇతన్ని గురించి మరొక్క విషయం కూడా పురాణాలలో ఉన్నది. ఇతను చాలాకాలం నీటిలో ఉండి తపస్సు చేశాడు. ఆ సమయంలో రంభ మొదలైన అప్స రసలు అతని దగ్గిరికి వచ్చి తమ ఆటల తోనూ, పాటలతోనూ అష్టావక్రుణ్ణి సంతోషపెట్టారు. అతను వారిని ఏదైనా వరం కోరుకోమన్నాడు.

"మాకు విష్ణువు భార్యలం కావాలని ఉన్నది," అని అప్సరసలు అన్నారు.

"విష్ణువు కృష్ణావతార మెత్తినప్పుడు మీరంతా ఆయనకు భార్యలవుతారు," అని అష్టావక్రుడు వారితో అన్నాడు. అతను నీటిలో నుంచి బయటికి రాగానే వారంతా ఇతన్ని చూసి నవ్వారు. అష్టావక్రుడికి కోపం వచ్చి, "కృష్ణుడికి భార్యలయాక మీ భర్త లేనిసమయంలో బోయవాళ్ళ చేత మీరు అవమానం పొందుతారు," అని అప్సరసలను శపించాడు.







# బుద్ధితక్కువ గణితం

"ఎవర్రా అదీ? కప్పు లేచి పోయేటట్టు చదువుతున్నారూ?" అని తాతయ్య కేకేశాడు.

"మనింటో కాదు, తాతయ్యా! ఎదటింటి వాసు నూటికి నూరు మార్కులు తెచ్చుకోవాలని చదువుతున్నాడు," అన్నారు పిల్లలు.

"ఎంత గట్టిగా చదివితే అంత ఎక్కువ మార్కు లొస్తాయా ఏమిటి?" అన్నాడు తాతయ్య.

"అదికాదు, తాతయ్యా. వాసు స్నేహితుడు సూరి రోజూ గంట సేపు చదువుతాట్ట. వాడికి మొన్నటి పరీక్షల్లో నూటికి అరవయ్యో, డెబ్భయ్యో—అలా వచ్చాయి. అందుకని వాసు రోజూ గంటన్నర చదివి నూటికి నూరు మార్కులూ తెచ్చుకుంటాట్ట!"

పిల్ల లన్న ఈ మాటకు తాతయ్య విరగబడి నవ్వాడు. "ఏం, తాతయ్యా! అలా ఎక్కువ మార్కులు రావా?" అని చిన్నబ్బాయి అడిగాడు.

"ఒరే, దీన్ని బుద్ధి తక్కువ గణితం అంటారు. ఒక మనిషి పావు గంటలో అర్థ శేరు అన్నం తింటే గంటలో. రెండు శేర్ల అన్నం తింటాడుట్రా? బుద్ధి తక్కువ గణితం కాదూ? వెనకటికి కథ చెప్పినట్టుగా ఉంది..." అంటూ తాతయ్య పొడుంకాయ తీశాడు. "ఏం కథ, తాతయ్యా?...చెప్పు, తాతయ్యా?" అంటూ పిల్లలు మూగారు.

"ఏం కథ చెప్పమన్నార్రా? బుద్ధి తక్కువ గణితం కథ చెప్పనా?" అంటూ పొడుం పీల్చి తాతయ్య ఇలా చెప్పసాగాడు:

అనంగనగా ఒక దేశం. ఆ దేశానికి ఒక రాజు. ఈ రాజున్నాడే, ఇతను చాలా చిన్నవాడు. కొత్తగా పట్టాభిషేకమయింది. పట్టాభిషేకంతో బాటే పెళ్ళికూడా అయింది. పెళ్ళి అనుకున్న క్షణం నుంచీ కూడా రాజుకు ప్రతిదీ కలిసి వచ్చింది. రాజుగారి రాబడి పెరిగింది. దేశంలో అల్లర్లు తగ్గాయి.



తన భార్య వచ్చిన వేళావిశేషం మంచిది గదా అనుకుని రాజు ఆవిణ్ణి ఎంతో ఆదరంగా చూస్తూ వచ్చాడు. రాజు తన మీద అభిమానంగా ఉన్నాడుగదా అని రాణి తన భర్తకు అడుగడుగునా సలహాలిస్తూ వచ్చింది. పెళ్ళాం చెప్పిందిగదా అని రాజు ఆవిడ సలహాల ప్రకారమే చేస్తూ వచ్చాడు. అదేమి అదృష్టమో మరి, రాజు రాణి సలహా ప్రకారం చేసినప్పుడల్లా లాభిస్తూ వచ్చింది. ఈ విధంగా చాలాసార్లు జరిగాక రాజుకు ఆమెలో మంచి గురి కుదిరిపోయింది.

ఇలా ఉంటూండగా ఒకనాడు ఏం జరిగిందీ? రాజసభకు భటులు ముగ్గురు దొంగల్ని తెచ్చారు. దొంగలు తాము దొంగిలించిన సామానుతో సహా దొరికిపోయారు గనక పెద్ద విచారణ అవసరం లేకుండానే రాజు వారికి శిక్ష విధించాడు. దొంగలను పట్టిన వాళ్ళకి బహుమానం ఏదన్నా ఇద్దామన్న ఉద్దేశంతో అతను, "ఇంతకూ ఈ దొంగలను పట్టిన దెవరూ?" అని భటులను అడిగాడు. దొంగలను పట్టిచ్చినది ఒక సామాన్యపు కుక్క అని రాజుకు తెలియ వచ్చింది. ఇది ఆశ్చర్యకరమైన విషయం కద! అందుచేత రాజు సభ చాలిస్తూనే అంతఃపురానికి వెళ్ళి రాణితో కుక్క చేసిన ఘనకార్యం గురించి చెప్పేశాడు. రాణి ఆ కుక్కను ఎంతో మెచ్చుకున్నది.

కొద్దికాలం గడిచాక ఒకనాడు మంత్రి రాజు దగ్గిరికి బొక్కసం తాలూకు లెక్కలు తెచ్చి, "మన సేనకు త్వరలోనే జీతా లివ్వ వలిసి ఉంటుంది. జీతా లివ్వగా మన వద్ద ధనం మిగిలేటట్టు కనబడదు, ఏం సెలవు?" అని మాట సందర్భంగా అడిగాడు. మామూలుగా అయితే రాజు మంత్రిని, "నీ సూచన ఏమిటి?" అని అడగాలి. అయితే మన రాజున్నాడే, అతను మంత్రిని సలహాలు అడగటం చాలాకాలం క్రితమే మానేశాడు. అన్ని సలహాలూ చెప్పటానికి

రాణీ ఉందికాదూ! అందుచేత రాజు మంత్రి చెప్పిన మాట విని, "చూద్దాం లెండి," అని ఊరుకున్నాడు.

ఆ తరవాత అతనేం చేశాడూ? ఇంటికి పోయి భార్యతో, "చూశావా? సైనికులకి జీతా లివ్వటానిక్కూడా బొక్కసంలో చాలినంత డబ్బు లేదట. ఏదో ఒకటి చెయ్యకపోతే చిక్కే!" అన్నాడు.

"ఎందుకండీ ఈ సైనికులూ? తిండి దండగా, భత్యం దండగా! మీకు జ్ఞాపకం వుందా ఒక్క కుక్క ముగ్గురు దొంగల్ని ఎలా పట్టేసిందోనూ? సైనికుల కందరికీ ఉద్వాసన చెప్పేసి, వాళ్ళకి బదులు కుక్కల్ని పెంచుదాం. ముగ్గురేసి సైనికుల కొక కుక్కవంతున పెంచామంటే పని గడిచి పోతుంది. జీతాలనీ, భత్యాలనీ, ఆయుధా లనీ అంతులేని డబ్బు ఖర్చుండదు. వేళ కింత తిండి పడేస్తే చాలు, కుక్కలు ఎంతో విశ్వాసంగా కూడా ఉంటాయి!" అన్నది రాణి. రాజు కీ ఆలోచన అద్భుతమైనదిగా తోచింది. మర్నాడు ఆయన మంత్రితో, "వాళ్ళ జీతాలు వాళ్ళకి పారేసి సైనికు లందరినీ మాన్పించెయ్యండి. వాళ్ళకు బదులు కుక్కల్ని పెంచుదాం! జ్ఞాపకం ఉంచుకోండి—ముగ్గురేసి సైనికులకు ఒక



కుక్క! ఖర్చు బోలెడంత కలిసి వస్తుంది," అన్నాడు. మంత్రి నిర్ఘాంతపోయాడు. సేనాధిపతి మండిపడ్డాడు.

"బాగా ఆలోచించే ఈ ఏర్పాటుకు ఉత్తరు విస్తున్నారా?" అని మంత్రి రాజును అడిగాడు.

"ఇంక ఆలోచించే పనే లేదు. నేను చెప్పినట్టు చెయ్యండి," అన్నాడు రాజు.

"సేన లేకపోతే నేను మాత్రం ఎందుకూ? కుక్కల్ని యుద్ధరంగాన నడిపించగల శక్తి నాకు లేదు," అన్నాడు సేనాపతి.

సేనాపతి కూడా మానుకుంటే మరింత ఖర్చు కలిసి వస్తుంది! అందుచేత రాజు

సేనాపతి రాజీనామాను సంతోషంతో ఆమోదించాడు.

సైనికులు వెళ్ళిపోయారు, కుక్కలు వచ్చాయి. అవి అస్తమానమూ కాట్లాడుకుంటూ ఉండటమూ, భటులు వాటిని విడదీయలేక నానా అవస్థలూ పడటమూనూ!

అయిందా, ఇంతలో రాజుగారికి ఒక దుర్వార్త తెలిసింది. అదేమిటంటే, ఎవరో పెద్ద సేనతో మన రాజు మీదికి దండెత్తి వస్తున్నారట. మంత్రి ఈ మాట చెప్పి, "ఏమి సెలవు?" అని అడిగాడు.

"ఆలోచన దేనికి? మన కుక్కలను భటుల వెంట యుద్ధరంగానికి పంపండి!" అన్నాడు రాజు.

కుక్కలు యుద్ధరంగానికి వెళ్ళేసరికి శత్రుసైనికులు వాటి కేసి రొట్టె ముక్కలు విసిరారు. కుక్కలు తోక లాడిస్తూ ఆ సైనికుల చుట్టూ మూగాయి. యుద్ధం అయిపోయింది.

మంత్రి రాజుతో, "మన కుక్కలు శత్రువుల పక్షం చేరిపోయాయి. ఇప్పుడేమి సెలవు?" అని అడిగాడు.

రాజుకు ముచ్చెమటలూ పోశాయి. శత్రు సైన్యం నగరం ప్రవేశించింది. కాని వాళ్ళు నిజంగా శత్రు సైనికులు కారు, రాజుగారు తొలిగించిన సైనికులే. సేనాపతే వారిని నడిపించాడు. రాజుకు బుద్ధి రాగలందులకే వాళ్ళు ఈ నాటకం ఆడారు.

ఈ సంగతి మంత్రి వివరించాక రాజు మారు మాట్లాడకుండా సైనికులందరినీ మళ్ళీ పనిలోకి తీసుకున్నాడు. సేనాపతికి కూడా తిరిగి ఉద్యోగం ఇచ్చాడు. ఆ తరవాత రాజు భార్యను సలహా అడిగినదీ లేదు, ఆవిడ చెప్పినదీ లేదు.

తాతయ్య కథ పూర్తి చేసి పిల్లలతో, "ఇక మీరు పాఠాలు చదువుకోండి. చదివేది బుర్ర కెక్కటం ముఖ్యం గాని, కప్పు లెగిరి పోయేలా చదవటం కాదు," అన్నాడు.



# "నీ వాణ్ణి!"



[ రామతీర్థ కథ ]

గురు నానక్ చిన్నతనం నుంచి కూడా గొప్ప భక్తుడు. ఆయన యువకుడుగా ఉండగా ఒక పనిలో నియోగించబడ్డాడు. ఆ పని ఏమిటంటే ప్రజలకు ధర్మాలూ, ధాన్యమూ, డబ్బూ పంచటం.

ఒకనా డాయన యజమాని, నలుగురు మనుషులను ఆయన వద్దకు పంపి, వారికి పదమూడు శేర్ల పిండి కొలిచి ఇమ్మని ఆజ్ఞాపించాడు. నానక్ తన భాషలో "ఒకటీ, రెండూ, మూడూ" అని పైకి అంటూ పిండి కొలవసాగాడు. ఇలా పన్నెండు శేర్లు కొలిచే సరికి "తేరా" అనే సంఖ్య వచ్చింది. "తేరా" అంటూనే నానక్ ఒళ్ళు మరిచి భగవంతుడి పై మనసు లగ్నం చేశాడు.

"తేరా" అనే మాటకు పదమూడు అనే అర్థమేగాక, "నీ వాణ్ణి!" అనే అర్థం కూడా ఉన్నది. అదే నానక్ పారవశ్యానికి కారణం. అతను ఆ పారవశ్యంలో "తేరా, తేరా, తేరా" అంటూ చాలా సార్లు పిండి కొలిచేసి చివరకు మైకం వచ్చి పడిపోయాడు!





# వెంకటప్ప సంకటం

భీమన్న మామగారైన జమీందారుగారిని ఆశ్రయించి తిరిగే వారిలో వెంకటప్ప అనే వాడొకడుండే వాడు. వాడు జమీందారుగారి మనసు కనిపెట్టి మాట్లాడుతూ, తియ్యటి కబుర్లు చెబుతూ, ఎంతో పెద్ద మనిషిలాగా నటిస్తూ, అక్కర వచ్చినప్పుడు జమీందారు గారి వద్ద ధన సహాయం పొందుతూ సుఖంగా కాలక్షేపం చేస్తున్నాడు.

జమీందారుగారికి వెంకటప్ప మీద సదభిప్రాయం ఉండటంచేత ఆయన వెంకటప్పకు ఇచ్చిన డబ్బు తిరిగి పుచ్చుకునేవాడుకాడు. ఆ సంగతి తెలిసి వెంకటప్ప జమీందారు గారి వద్ద ధనం పుచ్చుకున్నప్పుడల్లా బాకీ చెల్లించటానికి ప్రయత్నించేవాడిలా ఆయన వద్ద నటించేవాడు.

ఈ విధంగా జమీందారుగారి ప్రాపకం సంపాదించుకుని సుఖంగా కాలక్షేపం చేస్తున్న వెంకటప్ప స్వతహాగా పెద్ద మనిషి కాని కారణం చేత తన గొయ్యి తానే తవ్వుకున్నాడు. ఆయన ఊళ్ళో అనేక మందితో, "జమీందారుగారి అల్లుడు. వట్టి వెర్రి వెంగళప్ప. అటువంటి వాడికి కూతురు నివ్వటంలో జమీందారుగారు చాలా తొందర పడి తెలివి తక్కువగా ప్రవర్తించాడు. ఆయనకు పట్టుదలే తప్ప తెలివితేటలు తక్కువ," అని పేలాడు.

జమీందారుగారంటే గౌరవంగలవాళ్ళూ, వెంకటప్పను చూసి అసహ్య పడేవాళ్ళూ, 'వీడికి జమీందారు ప్రాపకం లభించిందే!' అని అసూయ పడేవాళ్ళూ గ్రామంలో ఉన్నారు. వాళ్ళు జమీందారుగారితో వెంకటప్ప అనే మాటలు చెప్పేశారు. వెంకటప్ప అంటే మంచి అభిప్రాయం ఉండటం చేత జమీందారుగారు మొదట్లో ఈ మాట నమ్మలేకపోయాడు. కాని ఒకరికి నలుగురు చెప్పాక జమీందారుగారికి

వెంకటప్ప పెద్ద మనిషి కాడని రూఢిగా తెలిసిపోయింది. ఆయనది మంచి స్వభావమే గాని మనసు మహా పెళుసు. అది విరిగితే మరి అతకదు. అందుచేత ఆయనకు వెంకటప్ప మీద చెప్పరానంత ద్వేషం పుట్టుకొచ్చింది. ఈ ద్వేషాన్ని ఆయన తన మనస్సులోనే దాచుకున్నాడు.

జమీందారుగారి మనసులో కలిగిన ఈ మార్పు గురించి వెంకటప్పకు ఏమాత్రమూ తెలియదు. అతను జమీందారు గారి నుంచి ఏదో సహాయం పొందగోరి ఒక నాడు జమీందారుగారింటికి వచ్చి, నౌకరుతో తాను వచ్చానని జమీందారుగారితో చెప్ప మని కబురు చేశాడు.

"నా కోసం వెంకటప్ప వచ్చాడా? తక్షణం వెళ్ళి పొమ్మను. ఎన్నడూ నా గడప తొక్క వద్దని చెప్పు!" అని జమీందారుగారు నిప్పులు కక్కాడు.

"జమీందారుగారు తమర్ని చూడరట. ఈ చాయలకు రావద్దని కూడా మీకు గట్టిగా చెప్పమన్నారు," అని నౌకరు వెంకట ప్పతో చెప్పాడు.

వెంకటప్పకు ఈ మాట విని ఆశ్చర్యం కలిగింది. అతను తన చెవులను తానే నమ్మలేక, "నువ్వేదో తప్పు విని ఉంటావు.




ఫలాని వెంకటప్పగారు వచ్చారనీ, ఒక్క నిమిషం సేపు మాత్రమే మాట్లాడతారనీ చెప్పు," అని నౌకరును మళ్ళీ లోపలికి పంపాడు.

"నీకు బుద్ధి లేదురా? ఆ వెంకటప్పను ఒక్క క్షణంపాటు కూడా చూడననీ, నాకు వాడి ముఖం చూపించ వద్దనీ గట్టిగా చెప్పు," అని జమీందారుగారు నౌకరు మీద మండిపడ్డాడు.

నౌకరు వచ్చి జమీందారుగారన్న మాటలు వెంకటప్పతో చెప్పాడు. తనమీద జమీందారు గారికి ఎందుకో కోపం వచ్చిందనీ, తనమీద ఎవరో చాడీలు చెప్పి ఉంటారనీ వెంక

టప్పకు అర్థమయింది. జమీందారుగారికి తనపై కలిగిన దురభిప్రాయాన్ని మొగ్గలోనే తుంచి వెయ్యకపోతే తన భవిష్యత్తుకు చాలా నష్టమున్నదని గ్రహించి వెంకటప్ప బయటి అరుగు మీద బైఠాయించి, "సరే వారి దయ! వారు బయటికి వచ్చినదాకా ఇక్కడే కూచుంటాను," అని నౌకరుతో అన్నాడు.

నౌకరు లోపలికి వెళ్ళి, వెంకటప్ప బయట అరుగు మీద తిష్ఠ వేసినట్టు జమీందారుగారితో చెప్పాడు. జమీందారు గారికి పట్టరాని ఆగ్రహం వచ్చింది, వెంకటప్పను ఎలా సాగనంపాలా అని ఆయన ఆలోచించేటంతలో అల్లుడు భీమన్న ఆయన ఉన్న చోటికి వచ్చాడు.

వెంటనే ఆయన భీమన్నతో, "చూడు, నాయనా! వెంకటప్ప తెలుసు కాదూ? వాడు నన్ను చూడాలని వచ్చి వాకిట ఉన్నాడట. వాడి ముఖం చూడటం కూడా నా కిష్టంలేదు. అందుకని నౌకరుతో చెప్పిస్తే వాడు వినిపించుకో లేదు. నువు వెళ్ళి వాడితో ముఖాన కొట్టినట్టుగా చెప్పెయ్యి, తెలిసిందా? మాటంటే మాటే! ఎలా చెబుతావో, కర్ర విరిచినట్టుగా చెప్పాలి. వాడు ఏనాడూ తిరిగి మన గుమ్మం తొక్కకుండా చెయ్యి!" అన్నాడు.

"అదెంత పని, మామగారూ!" అంటూ భీమన్న బయటికి వచ్చాడు. బయటికి వెళ్ళేటప్పుడు మూల నుంచి ఒక కర్ర తీసుకుని బయటికి వచ్చాడు. భీమన్న వెంకటప్పను సమీపించి కర్రతో అతడి ముఖం మీద గట్టిగా కొట్టి, "నీ ముఖం ఇక్కడ ఎన్నడూ చూపించకు!" అన్నాడు. తరవాత కర్రను పెడీ మంటూ రెండుగా విరిచి, "మాటంటే మాటే!" అన్నాడు.

వెంకటప్ప ప్రాణాలు దక్కించుకుని పారిపోయాడు. అతను మళ్ళీ జమీందారు గారి గుమ్మం తొక్కిన పాపాన పోలేదు.

[ పై సంచికలో మరొక సంఘటన ]





# దయ్యాలకు దడవనివాళ్లు

ప్రపంచంలో దయ్యాలను చూసి దడుచుకునే వాళ్ళు ఉన్నట్టుగానే దయ్యాలను దడిపించే వాళ్ళూ, దయ్యాలకు దడవని వాళ్ళూ కూడా ఉన్నారు.

ఇటువంటి సాహసవంతులను గురించి అనేక కథ లున్నాయి.

ఒక ఊళ్ళో ఒక కాపు యువకుడుండేవాడు. అతను ఒక రోజు చీకటితోనే లేచి ఒక ఆమడ దూరాన ఉన్న సంతకు బయలుదేరాడు.

ఊరు విడిచి డొంకనపడి కొంతదూరం వెళ్ళాక వాడికి దారిలో ఒక మనిషి ఆకారం కనిపించింది.

"ఎవరు వారు? సంతకేనా ప్రయాణం?" అని అలవాటు చొప్పున కాపు కుర్రవాడు పలకరించాడు.

"నేను దయ్యాన్నిలే!" అని ఆ ఆకారం జవాబు చెప్పింది.

కాపు ధైర్యంగలవాడు. వాడు భయపడటానికి బదులుగా, "అ మాట చెప్పవేం? నేనూ దయ్యాన్నే!" అన్నాడు.

"ఎక్కడికి పోతున్నావు?" అని అడిగింది దయ్యం.

"సంతకి," అన్నాడు కాపు.

"నేనూ అక్కడికే. కలిసిపోదాం, కాలు సాగించు," అన్నది దయ్యం.

ఇద్దరూ కొంత దూరం నడిచాక దయ్యం, "ఇద్దరు నడవటానికి నాలుగు కాళ్ళెందుకు? కొంతదూరం నిన్ను మోస్తా, కొంతదూరం నన్ను మొయ్యి. అంచెల మీద సంత చేరుకుందాం," అన్నది.

"అయితే ముందు నువు నా భుజం మీద ఎక్కు," అన్నాడు కాపు.

దయ్యం సరేనని కాపు భుజాల మీద ఎక్కి కూచుంది. దయ్యం కావటం చేత బరువే లేకపోయింది. కాపు తనని కొంత

ఆర్. నారాయణరావు

దూరం మోసినాక దయ్యం, "ఇంక నిన్ను నేను మోస్తా," అన్నది.

కాని కాపును ఎత్తుకుంటూ దయ్యం, "అబ్బ, నువ్వింత బరువున్నావేం? దయ్యాలు బరువుండగూడదే!" అన్నది ఆశ్చర్యంగా.

"నేను దయ్యమయింది ఇంతకు ముందేగా?" అన్నాడు కాపు. దయ్యం ఈ మాటతో తృప్తిపడింది. "నా కింకా అనుభవం లేదు. మన దయ్యాలకి కలిగే పెద్ద ప్రమాద మేమిటో?" అన్నాడు కాపు.

"మనకున్నదల్లా ఒకటే పెద్ద ప్రమాదం. బతికున్న మనిషి మన మీద ఉయ్యగూడదు. అదొక్కటీ జ్ఞాపకం పెట్టుకో చాలు!" అన్నది దయ్యం.

ఇద్దరూ ఒక కాలవ దాటవలిసి వచ్చింది. కాలవని ఎవరికి వారుగా దాటటానికి నిర్ణయించుకున్నారు. దయ్యం చడీ చప్పుడూ లేకుండా కాలవ దాటింది. కాపు కుర్రాడు మాత్రం పెద్ద చప్పుడు చేస్తూ దాటాడు.

"కాలవ దాటటానికి అంత చప్పుడు చేస్తావేం?" అని దయ్యం కోప్పడింది.

"అనుభవం చాలదని చెప్పాను గద!" అన్నాడు కాపు.

కాలవ దాటినాక సంత ఎంతో దూరం లేదు. "ఇక్కణ్ణుంచీ సంత దాకా నిన్ను



నేను మోస్తాలే!" అంటూ కాపు దయ్యాన్ని తన భుజాల మీద ఎక్కించుకున్నాడు.

వాళ్ళిద్దరూ సంత చేరేసరికి బాగా తెల్లవారింది. దయ్యం తన భుజాల మీద నుంచి దిగే యత్నంలో ఉండటం చూసి కాపు యువకుడు దాని కాళ్ళు గట్టిగా పట్టుకున్నాడు. అది ఎంత అరిచి గీపెట్టినా వినక వాడు దయ్యాన్ని కాళ్ళతో పట్టుకుని కిందికి దించాడు. ఆ దగ్గరలోనే అమ్మకానికి తెచ్చిన గొర్రెలున్నాయి. అది చూసి దయ్యం తాను కూడా గొర్రె రూపం ధరించింది. తప్పించుకు పారిపోయి వాటిలో కలిసి పోల్చరాకుండా అయిపోవాలని దానీ ఉద్దేశం.

కాని కాపు దయ్యాల రహస్యం అదివరకే తెలుసుకుని ఉన్నాడు గనక దయ్యపు గొర్రె మీద ఊశాడు.

గొర్రె రూపు మార్చుకోవటం దయ్యానికి అసాధ్యమైపోయింది. కాపు యువకుడు దాన్ని మెడ మీది బొచ్చు పట్టుకుని బరబరా లాక్కుపోయి కసాయివాడికి మంచి ధరకు అమ్మేశాడు.

* * *

ఒక బస్తీలో ఒక ఆబోతెద్దులాటి బలశాలి ఉండేవాడు. అతడి ధైర్య సాహసాలకు అంతే లేదు. అయితే కటిక బీదవాడు, ఏపనీ చేతకాదు. అందుచేత సంతలో కొన్న





సామాన్లు బస్తీ వీధుల వెంట అమ్ముకుని జీవించటానికి యత్నించేవాడు. అలా సంపాదించే సొమ్ము గట్టిగా అతని తిండికే చాలేది కాదు. అటువంటి వాడికి పిల్ల నెవరిస్తారు ?

"లోకంలో నన్ను మించిన బలశాలి గాని, ధైర్యశాలిగాని లేడు. అయితేనేం? దారిద్ర్యం నా జీవితం నాశనం చేసేస్తోంది. నా కెవ్వరూ పిల్ల నివ్వకుండా ఉన్నారు," అని ఈ వీధి వ్యాపారి ఎరిగున్న వాళ్ళతో మొరపెట్టుకున్నాడు.

వారిలో ఒకడు ఇతని మొర్రు వినలేక విసిగి, "అంత ధైర్యం గలవాడివయితే మన ఊరి పెద్ద శెట్టిగారు కొన్న ఇంటి నుంచి దయ్యాన్ని వెళ్ళగొట్టరాదూ? ఆయన నీ యెత్తు ధనం పోస్తాడుగదా!" అన్నాడు.

ఈ మాట నిజమే. ఆ బస్తీలో ఉండే పెద్ద శెట్టి ఒక పాతకాలపు రాజభవనం ఒకటి బోలెడంత డబ్బు పోసి కొన్నాడు. దాని చుట్టూ ఉండే తోటా అదీ బాగు చేయించి, ఇంటికి మరమ్మతులూ అవీ చేయించి, బ్రహ్మాండంగా గృహప్రవేశం కూడా అయాడు. గృహప్రవేశం అయిన రాత్రే ఆయన నౌకర్లు ఇద్దరు వింత చావు చచ్చారు. వెంటనే శెట్టి ఆ భవనం ఖాళీ చేసి తన అసలు ఇంటికి వెళ్ళిపోయాడు. ఆ తరవాత ఆ భవనంలో ఊరికే ఉండ మన్నా ఎవరూ ఉన్నారుకారు. నిక్షేపంలాటి ఇల్లు పాడు పెట్టెయ్యవలసి వచ్చింది.

ఈ సంగతి మన వీధి వ్యాపారికి కూడా తెలుసు, కాని ఆ దయ్యాన్ని వెళ్ళగొట్టి శెట్టి గారి దగ్గిర బహుమానం పొందవచ్చునని అతనికి తట్టలేదు. ఈ ఆలోచన వినగానే అతను పెద్ద శెట్టిగారింటికి వెళ్ళి, "అయ్యా, మీరు పాడు పెట్టిన భవనంలో ఉండే దయ్యాన్ని నేను పోగొట్టగలను, నాకే మిస్తారు?" అని అడిగాడు.

"నువు దయ్యాన్ని నిజంగా పోగొట్టా వంటే పదివేల రూకలిస్తాను. ఊరి చివర

ఉన్న కుటీరం కూడా ఇచ్చేస్తాను,'' అన్నాడు పెద్ద శెట్టి.

వీధి వ్యాపారికి పరమానందమయింది. అతను పెద్ద శెట్టి మాట నమ్మకం లేక పత్రం మీద ఆయన చేత సంతకం పెట్టించుకుని, తాను దయ్యపు కొంపకు వెళ్ళటానికి సిద్ధంగా ఉన్నానన్నాడు.

పెద్దశెట్టి అతనికి కావలిసిన సామగ్రి ఇప్పించాడు. వీధి వ్యాపారి ఒక లాంతరూ, శేరు వెల్లుల్లీ, వీశెడు పకోడీలూ అడిగాడు. శెట్టి అతని వెంట తన నౌకర్లను పంపాడు. వాళ్ళు అతన్ని భవనంలోకి పంపి బయట తాళం వేసి చీకటి పడకముందే వెళ్ళిపోయారు. వీధి వ్యాపారి ఆ భవనంలో ఒక గది శుభ్రం చేసుకుని, దీపం వెలిగించి, పకోడీలు తిని, శేరు వెల్లుల్లీ నమిలి మింగాడు. తరవాత దీపం ఆర్పి అతను ఆ గదిలో ఉన్న మంచం మీద కూచుని దయ్యం కోసం ఎదురు చూడసాగాడు.

అర్ధరాత్రి దాటినాక గది వెలపల పెద్ద చప్పుడయింది. దఢాల్న గది తలుపులు తోసుకుని దయ్యం లోపలి కొచ్చింది. దయ్యం తన సమీపానికి వచ్చినదాకా నిశ్చలంగా కూచుని, వీధి వ్యాపారి ఒక్కసారిగా దాని పైకి దూకి దాని రెండు చేతులూ




గట్టిగా పట్టుకున్నాడు. ఆ పట్టు నుంచి తప్పించుకోవటం దయ్యానికి సాధ్యం కాలేదు. అది అతని ముఖాన ఊద సాగింది. దాని శ్వాస మంచు కన్న చలిగానూ, సూదులతో గుచ్చుతున్నట్టు దుర్భరంగానూ ఉండటంచేత వీధి వ్యాపారి తన ముఖాన్ని పక్కకు తిప్పేసుకున్నాడు. దయ్యం ఊదే గాలి అతని మెడకు తగిలి మెడ కొయ్య బారిపో నారంభించింది.

ఆ బాధ భరించలేక వీధి వ్యాపారి బలవంతాన మెడ తిప్పుకుని దయ్యం ముఖాన తన నోటి గాలి ఊదాడు. ఆ గాలి వెంట వచ్చిన వెల్లుల్లి వాసన భరించలేక దయ్యం



తన ముఖం తిప్పేసుకుంది. అది తన కేసి ముఖం తిప్పినప్పుడల్లా అతను దాని ముఖాన ఊదాడు. ఈ విధంగా తెల్లవారిం దాకా ఆ యిద్దరి మధ్యా పోటాపోటీ జరిగింది. ఏమైనా వీధి వ్యాపారి దయ్యం చేతులు మాత్రం వదలలేదు.

తెల్లవార వచ్చింది. దయ్యం అదృశ్యమై పోతుందేమోనని వీధి వ్యాపారి భయపడి దాని చేతులు మరింత గట్టిగా పట్టుకున్నాడు. దయ్యం అదృశ్యం కాలేదు గాని క్రమంగా చిన్నదై పోతున్నట్టు అతనికి తోచింది. కాని దాని రూపం చూడటం ఆ చీకట్లో అతనికి సాధ్యం కాలేదు.

తూర్పు తెల్లవారుతూనే అతని మిత్రులూ, పెద్దశెట్టి నౌకర్లూ వచ్చి తలుపులు తెరిచారు. వీధి వ్యాపారి చచ్చిపోయి ఉంటాడని వారు భయపడ్డారు. అయితే అతను క్షేమంగానే ఉన్నాడు. అతని రెండు చేతులలోనూ ఒక కర్రముక్క ఉన్నది.

"ఇదుగో దయ్యం," అంటూ అతను వచ్చిన వారికి ఆ కర్రముక్క చూపాడు. అందరూ కలిసి ఆ కర్రముక్కను దూరంగా తీసుకుపోయి తగలేశారు. అది మామూలు కర్రముక్క మాత్రం కాదు. అది తగల బడుతుంటే పీనుగులు కాలే వాసన వచ్చింది.

ఆ తరవాత ఆ భవనంలో దయ్యం జాడ కనిపించ లేదు. పెద్దశెట్టి ఆ ఇంటిని మరొకసారి బాగు చేయించి, రెండవసారి గృహప్రవేశం అయాడు. ఎవరికీ ఎలాటి ప్రమాదాలూ జరగలేదు.

శెట్టి వీధి వర్తకుడికి ఒప్పందం ప్రకారం పదివేల రూకలూ ఇచ్చి, ఊరి చివర ఉండే కుటీరం కూడా ఇచ్చేశాడు. వీధి వర్తకుడు పెళ్ళి చేసుకుని ఆ కుటీరంలో సుఖంగా సంసారం ఏర్పాటు చేసుకున్నాడు.

* * *

ఒక నగరంలో ఒక విద్వాంసు డుండే వాడు. ఒకనాడొక స్నేహితుడు ఆయన

ఇంటికి అతిథిగా వచ్చాడు. అది వేసవి కాలం అయినప్పటికీ ఆ విద్వాంసుడి ఇంటి గదులలో ఒకటి ఎంతో చల్లగానూ, సుఖం గానూ ఉన్నది.

మిత్రుడు విద్వాంసుడితో, "ఏమోయ్, ఈ గది చాలా సుఖంగా ఉంది. ఈ రాత్రికి నా కిక్కడే పక్క వేయిస్తావా?" అన్నాడు.

"నీకు తెలియదేమో, ఈ గదిలో దయ్యం ఉన్నది. పగలు ఏ భయమూ లేదుగాని, రాత్రిపూట ఈ గదిలోకి ఎరవమూ రాము," అన్నాడు విద్వాంసుడు.

"దయ్యమా? ఏ రకం దయ్యం?" అని మిత్రుడడిగాడు.

"కొన్ని ఏళ్ళ క్రితం మా పని మనిషి ఒకతె ఈ గదిలో దూలానికి తాడు వేసి ఉరి పోసుకుని చచ్చి పోయింది. అప్పటి నుంచీ అది దయ్యమై ఈ గదిలోనే ఉంటున్నది. మేము దీన్ని దాదాపు పాడు పెట్టాం," అన్నాడు విద్వాంసుడు.

ఈ మాట వినగానే మిత్రుడికి తప్పక ఆ గదిలోనే పడుకోవాలనిపించింది. అతనికి దయ్యాలంటే భయం ఏమీ లేదు. స్నేహితుడి మాట తీసి వెయ్యలేక విద్వాంసుడు అతనికి ఆ రాత్రి ఆ గదిలోనే పక్క వేయించాడు. మిత్రుడు చాలా పొద్దు పోయినదాకా చదువుతూ కూచుని, చివరకు



పుస్తకం మూసి, బల్లపైన పెట్టి, పక్కమీద నడుము వాల్చాడు.

అతను పక్క మీద పడుకున్నదే వ్యవధిగా గదిలో దయ్యం ప్రత్యక్షమయింది. దయ్యం లోపలికి వచ్చిన పద్ధతి అతను చూస్తూనే ఉన్నాడు. తలుపు సందుల కుండా కాగితం పొరలాటిది లోపలికి వచ్చింది. అది విస్తరించి చిన్న మబ్బు లాగా పెరిగి చివరకు ఆడదాని రూపం ధరించింది.

ఈ ఆడది గది మధ్యకు వచ్చి నిలబడి నాలుక పొడుగుగా బయటికి చాచి తల వెనక్కు వంచింది.

ఇది మామూలు వెక్కిరింతలాటిది కాదు—అంతకన్న భయంకరమైనది—ఉరి పోసుకున్న మనిషికి కలిగే చేష్ట.

అయితే ఈ చేష్ట చూసి అతను భయ పడకపోగా, "అద్భుతం! ఏదీ మళ్ళీ చెయ్యి!" అన్నాడు దయ్యంతో.

అతన్ని భయపెట్టలేక పోయినానని దయ్యం గ్రహించింది. అది ఒక్క క్షణం ఆలోచించి, తన తల తీసి అక్కడ వున్న ఒక బల్ల మీద పెట్టింది.

"నీకు తల ఉంటేనే భయపడనివాణ్ణి, మొండెం చూసి భయపడతానా?" అన్నా డతను నవ్వుతూ. దాంతో దయ్యానికి చిరా కెత్తి మాయమైపోయింది.

ఈ సంగతి మర్నాడు అతను విద్వాంసు డితో చెప్పినప్పుడు ఆయన, "చూశావా, ఇంకెప్పుడూ ఆ గదిలో పడుకోకు. నేను ముందే చెప్పాను," అన్నాడు. కాని ఇందుకు మిత్రుడు ససేమీ ఒప్పక ఆరోజుకూడా తాను ఆ గదిలోనే పడుకుంటానని పట్టుబట్టి పడుకున్నాడు.

ఒక రాత్రివేళ దయ్యం వచ్చింది. అది అతన్ని చూస్తూనే, "ఛీ, మళ్ళీ ఈ మొండి ఘటమే దాపరించాడూ?" అంటూ మాయమై పోయింది.





# కిష్కింధా కాండ

వసంతకాలం. పంపాసరస్సులోని జలం నిర్మలంగా ఉన్నది. అందులో కమలాలూ, నల్ల కలువలూ పూస్తున్నాయి. సరస్సు చుట్టూ ఉండే అరణ్యం అత్యంత మనో హరంగా ఉన్నది. గండు కోయిలలు కూస్తున్నాయి. నెమళ్లు నాట్యం చేస్తున్నాయి.

ఈ వసంత శోభను గమనించి రాముడు ఒక వంక ఆనందమూ, మరొక వంక సీతకై విరహమూ పొంది తన స్థితికి ఎంతగానో విలపించాడు. ఎటు చూసినా, దేన్ని చూసినా అతనికి సీతే జ్ఞాపకం వచ్చింది. అతను లక్ష్మణుడితో నిరాశాపూరితంగా మాట్లాడాడు. "లక్ష్మణా, ఈ మనోహరమైన ప్రాంతంలో నా వెంట సీతే ఉంటే జీవితంలో ఇంకేమీ కోరను. కాని సీత లేకుండా జీవించటం అసంభవంగా ఉన్నది. నేను ప్రాణాలు వదిలేస్తాను, నీవు భరతుడి వద్దకు వెళ్ళి పో," అని పెద్ద పెట్టున ఏడవసాగాడు.

లక్ష్మణుడు రాముడికి హితం చెప్పాడు. సీతపై గల అమితమైన ప్రేమచేతనే దుఃఖం కలుగుతున్నదనీ, ఆ ప్రేమనూ, విరహాన్నీ దూరంగా ఉంచమనీ, రావణుడి జాడ తెలుసుకుని సీతను తెచ్చుకోవలసి ఉన్నదనీ, రావణుడు మంచిగా సీత నివ్వకపోతే అతణ్ణి వధించవలిసి ఉంటుందని, ఇందుకు ధైర్యం అవసరమనీ, దుఃఖం కార్యనాశక మనీ లక్ష్మణుడు రాముడికి చెప్పి ధైర్యం కలిగించాడు. వారిద్దరూ ఆ వనమంతా తిరగసాగారు.





సుగ్రీవుడు తన మంత్రులతో, "వీరెవరో నారబట్టలు కట్టి, మారు వేషాలు వేసుకుని, పని బెట్టుకుని ఈ అరణ్యంలోకి వచ్చారు. ఎందుకో తెలుసా? వాలే వీరిని పంపి ఉంటాడు," అన్నాడు. ఆ మాటలు విని అందరూ భయపడ్డారు.

అప్పుడు, సుగ్రీవుడి మంత్రులలో ఒక డైన హనుమంతుడు, "మీరంతా ఎందుకిలా భయపడుతున్నారో తెలియకుండా ఉంది. ఈ ఋశ్యమూకం మీదికి వాలి రాడు, అతని జాడకూడా ఏమీ కనిపించలేదు. రాజైన వాడికి ఇలాటి చపలచిత్తం కూడదు," అని చెప్పాడు.

రామలక్ష్మణులు పంపాసరస్సు వద్దకు వచ్చిన క్షణం నుంచీ, ఋశ్యమూక పర్వతం మీద ఉంటున్న సుగ్రీవుడనే వానరరాజు వారిని చూస్తూనే ఉన్నాడు. ఏనుగు గున్నల్లా గున్న ఆ ఇద్దరూ ఆ ప్రాంతానే తచ్చాడుతూ ఉండటం చూసి సుగ్రీవుడికి దడ పుట్టు కొచ్చింది. తనకు కీడు చేసే ఉద్దేశంతో తన అన్న అయిన వాలి వారిని పంపి ఉంటా డనుకుని సుగ్రీవుడు తన మంత్రులైన వానరులతో సహా మతంగాశ్రమంలోకి వెళ్ళి కూచున్నాడు. ఎందుకంటే అక్కడ వారికి వాలి భయం లేదు. వాలి తాలూకు మను షులు కూడా అక్కడికి రాలేరు.

ఆ మాట విని సుగ్రీవుడు, "వాలి ఇక్కడికి వచ్చాడని నే ననలేదు. ఆ మనుషులను చూడు; పొడుగైన వాళ్ళ చేతులు చూడు, ఆ చేతుల్లో ఉండే కత్తులూ, వారి విల్లంబులూ చూడు! వారిని చూస్తే ఎవరికైనా భయం కలుగుతుంది. వాలే వారిని తప్పక పంపి ఉంటాడని నా అను మానం. వాలి రాజు గనక అతనికి ఎందరో సహాయకులుంటారు. మనం ఎంతో జాగ్రత్తగా ఉండాలి. లేకపోతే మనని శత్రువులు ఏమార్చి నాశనం చేసేస్తారు. వాలి మహాదక్షుడు. అందుచేత నీవు మాసు



వేషంతో వెంటనే వారి వద్దకు వెళ్ళి, వారితో మాట్లాడి వారి రహస్యం ఏమిటో తెలుసుకు రావాలి," అన్నాడు.

తమ రాజైన సుగ్రీవుడి అభిప్రాయం తెలుసుకుని హనుమంతుడు వానర రూపం వదిలి బ్రహ్మచారి రూపం ధరించి రామ లక్ష్మణుల వద్దకు వెళ్ళి, వినయంతో వారికి నమస్కారం చేసి, "అయ్యలారా, మీరు వ్రతదీక్ష బూని తపస్సు చేసుకునే రాజర్షుల్లాగా కనిపిస్తున్నారు; ఎక్కడో రాజ్యాలేల వలసిన మీరు ఈ పంపా సరోవర ప్రాంతాన, నారబట్టలు కట్టి ఎందుకు తిరుగుతున్నారు? మీ రెవరు? మా రాజైన సుగ్రీవుడనే వానరుడు అన్న చేత వెళ్ళగొట్టబడి, దీనుడై తిరుగుతున్నాడు. నే నాయన మంత్రిని. నా పేరు హనుమంతుడు. నా తండ్రి వాయుదేవుడు. సుగ్రీవుడి కోరికపై నేను ఈ బ్రహ్మచారి రూపు ధరించి ఋశ్యమూక పర్వతం నుంచి వచ్చాను. నాకు కామరూప, కామగమన శక్తులున్నాయి," అని చెప్పాడు.

హనుమంతుడి మాటలు వింటూంటే రాముడి ముఖాన ఆనంద రేఖలు గోచరించాయి. అతను లక్ష్మణుడితో, "ఇతనికి నీవే సమాధానం చెప్పు. ఇతని మాటల తీరు చూడగా మంచి భాషా జ్ఞానమూ,



పాండిత్యమూ కలవాడుగా కనిపిస్తున్నాడు. ఇలాటి దూతలు గల రాజే రాజు," అన్నాడు.

అప్పుడు లక్ష్మణుడు హనుమంతుడి కేసి తిరిగి, "హనుమంతుడా, వానర రాజైన సుగ్రీవుణ్ణి గురించి మాకు బాగా తెలుసు. మే మాయనకోసమే వెతుకుతూ వస్తున్నాము. ఈయన మా అన్న రాముడు. ఇతనికి మీ సుగ్రీవుడి సహాయం కావలసి ఉన్నది. సుగ్రీవుడికి ఈయన తిరిగి రాజ్యం ఇప్పించగలడు," అంటూ తమ కథ యావత్తూ హనుమంతుడికి సవిస్తరంగా చెప్పేశాడు. చిట్టచివరకు, "రాముడి భార్యను తీసుకుపోయిన రాక్షసుడి జాడ సుగ్రీవుడు చెప్ప



గలడని కబంధుడి ద్వారా మాకు తెలిసింది. సీతను వెదకటానికి సుగ్రీవుడు మాకు సహాయపడాలి. అడిగిన వారికి అంతులేని దానాలు చేసిన ఈ రాముడు ఈ సహాయం కోసం సుగ్రీవుడి శరణు జొచ్చాడు," అని లక్ష్మణుడు హనుమంతుడితో అన్నాడు. ఈ మాటలు నోటి వెంట అనటానికి లక్ష్మణుడికి ఎంతో దుఃఖం కలిగింది.

హనుమంతుడు లౌక్యంగా, "మీరు మహానుభావులు. మిమ్మల్నే సుగ్రీవుడు వెతుక్కుంటూ రావలిసింది. ఆయన పుణ్యవశాన మీరే ఆయనను వెతుక్కుంటూ వచ్చారు. సీతాదేవిని వెతకటానికి సుగ్రీవుడు పూర్తిగా మీకు సహకరిస్తాడు. ఇంక మనం సుగ్రీవుడి వద్దకు పోదామా?" అన్నాడు.

హనుమంతుడు నమ్మదగిన వాడేననీ, అతను నిజమే చెబుతున్నాడనీ తృప్తి కలిగి రామలక్ష్మణులు అతని వెంట వెళ్ళటానికి సిద్ధపడ్డారు. హనుమంతుడు బ్రహ్మచారి రూపు వదిలిపెట్టి వానర రూపం ధరించి, రామలక్ష్మణులను తన వీపు మీద ఎక్కించుకుని ఋశ్యమూక పర్వతానికి వెళ్ళాడు. సుగ్రీవుడు ఋశ్యమూకం మీద లేడు, మలయపర్వతం మీద ఉన్నాడు; హనుమంతుడు అక్కడికి వెళ్ళి రామలక్ష్మణులు వచ్చి ఉన్నారనీ, సుగ్రీవుడు వచ్చి వారితో స్నేహం చేసుకోవటం లాభకరమనీ చెప్పాడు. రామలక్ష్మణులకు సుగ్రీవుడి వల్ల కావలిసిన సహాయంకూడా వివరించాడు.

హనుమంతుడి మాటలు విన్నాక సుగ్రీవుడి భయం తీరిపోయింది. అతను సంతోషించి, తన వానరరూపు విడిచి అందమైన మానవరూపు ధరించి రామలక్ష్మణులను చూడవచ్చాడు. ఆయన రాముడితో, "మిమ్మల్ని గురించి హనుమంతుడు అంతా చెప్పాడు. మహారాజువైన నీవు నా స్నేహం కోరి రావటం వానరుణ్ణయిన నాకు ఎంతో గౌరవం, ఎంతో లాభకరం," అంటూ స్నేహ

చిహ్నంగా చెయ్యి చాచాడు. రాముడు సుగ్రీవుడి చేతిని పట్టుకుని తన స్నేహ భావాన్ని అతడికి స్పష్టం చేశాడు. తరవాత రాముడు సుగ్రీవుణ్ణి గాఢంగా ఆలింగనం చేసుకున్నాడు.

హనుమంతుడు అరణులు మధించి అగ్ని చేసి, ముందుగా తానా అగ్నిని పూజించి తెచ్చి రామ సుగ్రీవుల మధ్య ఉంచాడు. వారిద్దరూ ఆ అగ్నికి ప్రదక్షిణం చేసి అగ్ని సాక్షిగా మైత్రి చేసుకున్నారు. ఇకనుంచీ ఒకరి సుఖదుఃఖాలు మరొకరివని ప్రమాణం చేసుకున్నారు. సుగ్రీవు డొక మద్దికొమ్మ విరిచి తెచ్చాడు. రాముడూ అతనూ ఆ కొమ్మమీద కూచున్నారు. అలాగే హను మంతు డొక చందనపు చెట్టుకొమ్మ విరిచి తెచ్చి లక్ష్మణుణ్ణి దానిపై కూచోబెట్టాడు. అప్పుడు సుగ్రీవుడు రాముడితో, "రామా, నా అన్న అయిన వాలి నాకు అన్యాయం చేశాడు, నా భార్యను అపహరించాడు. వాలి భయంతో ఇలా అడవులు పట్టి తిరుగు తున్న నాకు అభయం ఇవ్వాలి," అన్నాడు.

"సుగ్రీవా, నీ స్నేహానికి ప్రత్యుపకారంగా నేను నీ అన్న అయిన వాలిని చంపేస్తాను. అతని చావు నా బాణాలలోనే ఉన్నది," అని రాము డన్నాడు.



"నీ అనుగ్రహంతోనే నేను రాజ్యాన్నీ, నా భార్యనూ తిరిగి పొందవలసి ఉన్నది. మీరు ఏ పని మీద ఈ నిర్జన వనాల్లో తిరుగు తున్నారో అదంతా హనుమంతుడు చెప్పాడు. నీవూ, నీ తమ్ముడూ లేని సమయం చూసి ఒంటిగా ఉన్న సీతాదేవిని బలాత్కారంగా రావణుడు ఎత్తుకుపోయాడు. తనకు అడ్డు తగిలిన జటాయువును కూడా అతను చంపేశాడు. నీకు త్వరలోనే భార్యా వియోగం పోతుంది. సీతాదేవి మూడు లోకాలలో ఎక్కడ ఉన్నప్పటికీ ఆమెను తెచ్చి నీకు అప్పగిస్తాను. ఇప్పుడు నాకు అర్థమయింది, నేనా నాడు చూసినది సీతా



దేవినే, సందేహం లేదు. రావణుడి ఒడిలో కూచుని ఏడుస్తూ ఆకాశ మార్గాన పోతున్న సీతను నేను చూశాను. ఆవిడకూడా నన్నూ, నా వెంట ఉన్న నలుగురు వానర వీరులనూ చూసింది; చూసి, తన ఆభరణాలను పై బట్టలో మూట గట్టి మా కేసి విసిరింది. ఆ ఆభరణాలను ఇంత కాలంగా భద్రంగా ఉంచాము. వాటిని చూసి నీవు గుర్తు పట్ట వచ్చు," అన్నాడు.

రాముడీ మాట విని ఆ ఆభరణాలు చూడటానికి తహతహ లాడాడు. సుగ్రీవుడు లేచి ఒక గుహలోకి వెళ్ళి, సీత ఆభరణాల మూటతో తిరిగి వచ్చాడు. మూటను



చూస్తూనే రాముడు సీత ధరించిన పై బట్టను గుర్తించి శోకావేశంతో కూలిపోయాడు. అతను కంటికీ మంటికీ ఏకధారగా ఏడుస్తూ, "లక్ష్మణా, రావణుడు ఎత్తుకుపోయేటప్పుడు సీత పడవేసిన ఈ పై బట్టా, నగలూ చూడు. వీటిని దట్టమైన పచ్చిక మీద వేసిందికాబోలు, కొంచెంకూడా దెబ్బ తగల కుండా ఎలా ఉన్నాయో!" అన్నాడు.

లక్ష్మణుడు సీత ఆభరణాలు చూసి, "ఈ కేయూరాలూ, కుండలాలూ నేను గుర్తించలేదు గాని, సీత కాళ్ళకు నమస్క రించేటప్పుడు కనిపించిన అందెలు మాత్రం ఇవే," అన్నాడు.

రాముడు సుగ్రీవుడి కేసి తిరిగి, "నీవు చూస్తూండగానే గదా ఆ రాక్షసుడు ప్రాణ సమానురాలయిన నా భార్యను ఎత్తుకు పోయాడు! వాడెక్కడికి వెళ్ళాడు? దయ చేసి చెప్పు, వాడి ప్రాణాలు ఇప్పుడే తీస్తాను," అన్నాడు.

రావణుణ్ణి గురించి తనకు ఏమీ తెలియ దన్నాడు సుగ్రీవుడు; అయితే సీత దొరక గలందులకు తగిన ప్రయత్నాలన్నీ తాను చేస్తానని ప్రతిజ్ఞ చేశాడు. తరవాత అతను రాముడికి ధైర్యం చెబుతూ, "వానర మాత్రుణ్ణి అయి ఉండికూడా నేను భార్య

కోసం ఇలా దుఃఖంతో కుంగి పోలేదు. దుఃఖం వల్ల ప్రయోజనం లేదు, పౌరుషం అవలంబించాలి, ధైర్యంగా ఉండాలి,'' అని హితవు చెప్పాడు.

ఈ మాటలు విని రాముడు ధైర్యం తెచ్చుకుని, కళ్ళు తుడుచుకుని సుగ్రీవుడితో, ''నీవు నిజమైన మిత్రుడనదగిన మాట అన్నావు. కష్ట సమయంలో నీలాటి ఆప్తుడు దొరకటం కష్టం. నీవు మాత్రం సీతను వెతికే ప్రయత్నం తప్పక చేయాలి. ఇప్పుడు నేను నీకు చెయ్యవలసిన సహాయం గురించి చెప్పు. ఆ సహాయం నా వల్ల అవుతుందో కాదోనన్న సందేహమేమీ పెట్టుకోకు. వాలిని చంపుతానని మాట ఇచ్చానే. అందులో అబద్ధమేమీ లేదు. నే నెన్నడూ అబద్ధ మాడినవాణ్ణి కాను,'' అన్నాడు.

రాముడి మాటలకు వానరులు పరమానందం చెందారు. తరువాత రామ సుగ్రీవులు ఏకాంతంగా సంభాషించుకుని తమతమ కష్టాలు ఒకరికొకరు చెప్పుకున్నారు. సుగ్రీవుడు రాముడితో, ''నా అన్న వాలి బలశాలి. యువరాజుగా ఉన్న నన్ను తిట్టి, రాజ్యం నుంచి వెళ్ళగొట్టాడు. ప్రాణాల కన్న ఎక్కువైన నా భార్యను హరించాడు. నా స్నేహితులను కారాగృహంలో పెట్టాడు. నన్ను చంపే ఉద్దేశంతో ఎన్నో ప్రయత్నాలు చేస్తున్నాడు. అతను పంపిన వానరులను ఎంతమందినో నేను చంపాను. మా అన్న భయంతోనే నేను మిమ్మల్ని చూడగానే మీ ఎదటికి రాలేదు. నా కిప్పుడున్నదల్లా ఈ హనుమంతుడు మొదలైనవారే. వారి చలవవల్లనే నే నింకా బతికి ఉన్నాను. నాకు పరమ విరోధి అయిన ఆ వాలి చస్తే తప్ప నాకు జీవితం లేదు, సుఖం లేదు. ఇది నా విషాదగాథ. కష్టాలు మిత్రులకే చెప్పుకోవాలిగద,'' అన్నాడు.



# 17. పార్థినాన్

గ్రీసుదేశంలోని ఏథెన్స్ నగరం వద్ద ఈ ఎథీనీ దేవాలయం క్రీస్తు పూర్వం 447–438 సంవత్సరాల మధ్య కాలంలో నిర్మించబడింది. ప్రాచీన శిల్పానికి అత్యుత్తమమైన నమూనాగా గుర్తించబడే ఈ కట్టడం పాల రాతిది. దీనిలో 98 స్తంభా లున్నాయి. ఇందులో 42 అడుగుల ఎత్తు గలిగి దంతంతో చేయబడిన ఎథీనీ విగ్రహం ఉండేది.

ఒకప్పుడు గ్రీకులకు దేవాలయమైన ఈ కట్టడాన్ని బైజాంటైనులు చర్చిగా మార్చారు. అటు తరవాత తురుష్కులు దీనిని మసీదుగా చేసుకున్నారు. మన దేశంలో తాజమహలును చూసినట్టే ఈ కట్టడాన్ని పున్నమి వెన్నెలలో చూస్తే అద్భుతంగా ఉంటుందట.

1687 లో వెనీషియనులు పార్థినాన్ పై కాల్పులు చేశారు. దీని తాలూకు స్తంభాలు 8 శిథిలం కాగా 1830 లో అమెరికనుల ఆర్థిక సహాయంతో వాటిని మరమ్మతు చేశారు.





# ప్రశ్నోత్తరాలు

1. గోపాలచంద్ర గోఖలే, ఛత్రపురం

"చందమామ" ఎప్పుడు ఎక్కడ జన్మించింది? ఎన్ని భాషలలో ప్రచురింపబడుచున్నది?

"చందమామ" 1947 జులైలో మద్రాసులో జన్మించింది. హిందీ, మరాఠీ, తెలుగు, కన్నడ, తమిళ, గుజరాతీ భాషలలో ప్రచురితమవుతున్నది.

2. జె. సూర్యనారాయణరావు, గద్వాల

అన్నయ్యా, భారతదేశములోని ప్రజలు చాలావరకు పల్లెలలో నుందురు. దీనికి కారణమేమిటి?

పారిశ్రామికంగా ముందుకు వచ్చే దేశాలలో నగరాలు హెచ్చుగా ఏర్పడతాయి. కార్మికులుగా జీవించే అవకాశం హెచ్చు మందికి దొరుకుతుంది. మనదేశం పారిశ్రామికంగా ముందుకు రాకపోవటం చేత అధిక సంఖ్యాకులు భూమినే నమ్ముకుని పల్లెలలో బతుకుతున్నారు.

3. పి. తాతారెడ్డి, రావులపాలెం

అన్నయ్యా, సోమనాథ దేవాలయము నాశనము చేసిన వారిపేరు చెప్పినారు కాని దానిని ఎవరు కట్టించినారో చెప్పలేదు.

తురుష్కులు ధ్వంసం చేసిన సోమనాథ దేవాలయం కలపతోనూ ఇటుకలతోనూ కట్టినది. వారు వెళ్ళిపోయినాక, గుజరాతు ఏలిన సోలంకి రాజు మొదటి భీముడు ఆ ఆలయాన్ని రాతితో పునర్నిర్మించటానికి ఉపక్రమించాడు.

4. పి. రామకృష్ణరాజు, విశాఖపట్నం

అమెరికాలో పెక్కు రేడియో, టెలివిజన్ కంపెనీలు ఉన్నాయి కదా, అయా కంపెనీలు తమ శ్రోతల వద్ద నుండి ప్రతి ఫలాన్ని ఎలా పొందగలుగుతున్నాయి?

వ్యాపార ప్రకటనదార్లు రేడియోలకు డబ్బిస్తారు, ఆకర్షవంతమైన రేడియో, టెలివిజన్ కార్యక్రమాలకు అయే ఖర్చు భరించి, స్పాన్సార్ చేస్తారు.

5. ఎస్. వేణు, బరంపురం

అన్నయ్యా, నేను ఒక మంచి జానపద సీరియల్ వ్రాశాను. అది నీకు పంపిస్తాను, ప్రచురిస్తావా?

పంపవద్దు, "చందమామ" లో పడే సీరియల్ కథలు ఇప్పటికే పుష్కలంగా ఉన్నాయి. అందుచేత అలాటి కథలు పాఠకులు పంప నవసరంలేదు.

6. పాల్వాయి రఘోత్తమరెడ్డి, కాకెపల్లి

రెండవ చంద్రగుప్తుని ఆస్థానములోని "నవరత్నములు" అనబడు తొమ్మండుగురు కవులలో నొకడైన కాళిదాసు, ప్రతిహారవంశ రాజైన భోజ రాజేంద్రుని ఆస్థాన కవులలో నొకడైన కాళిదాసు ఒకరేనా? లేక వేరు వేరునా?

భోజుడి ఆస్థానంలో కాళిదాసు అనే కవి ఉన్నట్టు చరిత్ర చెప్పటం లేదు.

7. వై. ప్రమీలావతి, రంగూన్

అన్నయ్యా! మన చందమామని చంద్రుడు లేక చందమామ అని పిలుస్తూ యుంటాము. ఇతర దేశీయులు ఏమని పిలిచెదరు?

ఇతర దేశాలు చంద్రుడితో మనలాగా బంధుత్వం పెట్టుకున్నట్టు కనబడదు. కొన్ని దేశాలవారు చంద్రుణ్ణి స్త్రీగా కూడా భావిస్తారు.

8. లోకనెడ్డి కోటేశ్వరరావు, సిరిపురం

సూర్యుని పరిమాణమెంత? సూర్యునికి స్థానచలనము కలదా?

సూర్యగోళం యొక్క వ్యాసం నిడివి 8,67,000 మైళ్ళు. సూర్యుడి బరువు భూమి బరువు కన్న 3,33,000 రెట్లు. సూర్యుడికి స్థానచలనం ఉన్నది.

9. ఎం. మురళీకృష్ణ, విజయవాడ

మన పురాణాల ప్రకారం చంద్రుడు సముద్రుని కొడుకనీ, అంచేతే పౌర్ణమి రోజు సముద్రంలో అలలు ఎక్కువగా ఉంటాయంటారు. మరి దీనికి కారణ మేమిటి? ఏదైన శాస్త్రాధారముందా?

చంద్రుడియొక్క గురుత్వాకర్షణకులోనై చంద్రుడుండే వైపు సముద్రం పొంగే మాట నిజమే. దీనిని బట్టే చంద్రుడు సముద్రుడి కొడుకన్న కథ కల్పించారేమో! చంద్రుడు ఒకప్పుడు భూమిలో భాగమేననీ, ఏ కారణంచేతనో అది భూమి నుంచి విడి పడి దూరంగా వెళ్ళిందని కొందరు శాస్త్రజ్ఞు లంటారు. అదే నిజమైతే చంద్రుడి స్థానంలో ఏదో ఒక మహా సముద్రం ఉండి ఉండాలి. అప్పుడు చంద్రుడు సాక్షాత్తూ సముద్రుడి కొడుకే అవుతాడు!

Photo by E. Ramalingam



బహుమతి
పొందిన వ్యాఖ్య

రా జు

పంపినవారు :
ఎస్. పద్మిని, మద్రాసు - 1

Photo by K. N. Mullee



బహుమతి
పొందిన వ్యాఖ్య

పేద

పంపినవారు:
ఎస్. పద్మిని, మద్రాసు - 1

# మీకు తెలుసా?

...భూమి మీద గల నేలలో 9 శాతమే సాగుబడి అవుతోంది. 16 శాతం పచ్చికబీడు.

...1955 అగస్టు అనంతరం కలిగిన బలమైన భూకంపాల ఫలితంగా హిమాలయ పర్వతాలు 30 మీటర్లు (దాదాపు 100 అడుగులు) పెరిగాయి.

...చంద్రుడి యొక్క నీడ నిడివి 4 లక్షల కిలోమీటర్లు.

...మనిషి నిమిషానికి 125 మొదలు 160 మాటల దాకా పలకగలడు. మూడు సెకండ్ల కాలంలో పలికే మాటలు ఒక్క సెకండు కాలంలో అనుకోగలడు. ఇది ప్రయోగాల ద్వారా రుజువయింది.

...సూర్య కాంతి పడటం వల్ల భూమి లక్ష టన్నుల ఒత్తిడికి గురి అవుతోంది.

...1959 జులై ఉత్తరార్ధంలో భూభ్రమణ వేగం అకస్మాత్తుగా తగ్గి, రోజు యొక్క ప్రమాణంలో తగ్గుదల కలిగింది. ఈ తరుగుదల ఒక సెకండులో వెయ్యోవంతు కంటె ఒక్క పిసరు తక్కువ.

...ఆటుపోట్లు సముద్రానికే గాక నేలకు కూడా ఉన్నాయి. రోజుకు రెండు పర్యాయాలు మన మందరమూ 30 లేక 40 సెంటి మీటర్లు పైకి లేచి కిందికి దిగుతూ ఉంటాము.

...నీరు కూడా ఒత్తిడికి కుంచించుకుంటుంది—కాని వాయు వంతగా కాదు. నీటికి ఇలా కుంచించుకునే శక్తి లేకపోతే భూమిమీద సముద్రాల మట్టం ఇప్పుడున్న దానికన్న నగటున 25 మీటర్లు ఎత్తుండును; అందువల్ల 50 లక్షల చదరపు కిలో మీటర్ల భూమి నీటిలో మునిగి ఉండును.

...కార్బోమైడ్ (లేక యురియా) అనే ఎరువులో ఉండే నైట్రొజెన్ అమోనియంలో సల్ఫేట్‌లో ఉండేదానికి రెట్టింపు ఉంటుంది. దీని సహాయంతో పెరిగిన మామూలు గడ్డి కూడా పశువులకు మేలురకం మేత అవుతుంది.

...సృష్టిలో గల పదార్థా లన్నిటిలోకి ఎక్కువ తళుకూ, గట్టిదనమూ, మన్నికా గలది వజ్రం. కాని బొగ్గు నుంచి తయారయే కృత్రిమ వజ్రం సహజమైన వజ్రం కంటె దాదాపు 40 శాతం హెచ్చు గట్టిదనం కలిగి ఉన్నది.

...వంటకు ఉపయోగించే గాస్‌ను (సూనె ఆవిరిని) 3,000 డిగ్రీల వేడి కలిగించి, గొప్ప ఒత్తిడికి గురిచేసినట్టయితే దానినుంచి ఎలెక్ట్రానులు వెలువడతాయి. వీటిని కరెంటుగా ఉపయోగపరచుకోవచ్చు. ఈ పద్ధతి మీద చిన్నచిన్న విద్యుత్కేంద్రాల నుంచి హెచ్చు విద్యుచ్ఛక్తి సరఫరా అవుతుంది.

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫొటోల వ్యాఖ్యలు 1963 జూన్ నెల సంచికలో ప్రకటింపబడును.





★ పై ఫొటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగాని కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ ఏప్రిల్ నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

## ఏప్రిల్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : రాజు

రెండవ ఫోటో : పేద

పంపినవారు : ఎస్. పద్మిని,

మద్రాస్ - 1.

బహుమతి మొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# భారతం

పాండవులు హిమాలయం నుంచి ధనరాసులతో తిరిగి వచ్చిన కొద్దికాలానికే వ్యాసుడు వచ్చాడు. ధర్మరాజు ఆయనతో, "మీరు చెప్పిన ప్రకారమే ధనం తెచ్చాం. ఇక మీరు మా చేత అశ్వమేధ యాగం చేయించండి. అది ఎప్పుడు ఎలా చేయాలో మీరే నిర్ణయించాలి," అన్నాడు.

"నేనూ, పైలుడూ, యాజ్ఞవల్క్యుడూ కలిసి నీచేత ఈ యాగం చేయిస్తాం. వచ్చే చైత్ర పౌర్ణమినాడు యజ్ఞదీక్ష వహించు. సంభారాలన్నీ సిద్ధం చేయించు. యాగాశ్వాన్ని అశ్వవిద్య తెలిసిన సూతులూ, బ్రాహ్మణులూ పరీక్షించాలి. తరవాత ఆ గుర్రాన్ని దేశం మీద విడవాలి," అని వ్యాసుడు చెప్పాడు.

యాగాశ్వాన్ని కాపాడటానికి అర్జునుడు నియోగించబడ్డాడు. అతని వెంట నకులుడు కూడా వెళ్ళటానికి ఏర్పాటు జరిగింది. ధర్మరాజు యాగదీక్షలో ఉండే కాలంలో రాజ్య భారం మోసేపని భీముడికీ, కుటుంబ వ్యవహారాలు చక్కదిద్దేపని సహదేవుడికీ ఇచ్చారు.

అశ్వం వెంట బయలుదేరుతున్న అర్జునుడితో ధర్మరాజు, "నిన్ను ఎవరైనా క్షత్రియ వీరులు అడ్డగించితే వారితో వైరం రాకుండా ప్రవర్తించు. నేను అశ్వమేధం చేస్తున్నానని వారితో చెప్పి వారిని ఆహ్వానించు," అని చెప్పాడు.

చైత్రపూర్ణిమనాడు ధర్మరాజు చేత యజ్ఞదీక్ష పట్టించారు. యాగాశ్వాన్ని వ్యాసుడు స్వయంగా విడిచాడు. దాని వెంట వెళుతున్న అర్జునుణ్ణి అందరూ దీవించి పంపారు. అర్జునుణ్ణి చూడటానికి పురజనులు తండోపతండాలుగా వచ్చారు. అర్జునుడి వెంట యాజ్ఞవల్క్యుడి శిష్యుడొకడూ, కొందరు బ్రాహ్మణులూ, క్షత్రియులూ బయలుదేరారు.

యాగాశ్వం మొదట ఉత్తర దిక్కుగా పోయింది. దారిలో కిరాతులూ, యవనులూ, మ్లేచ్ఛులూ అర్జునుణ్ణి ఎదిరించి, యుద్ధం చేసి నాశనమైపోయారు. అర్జునుడు భారత యుద్ధంలో త్రిగర్తులను చంపాడు. వారి సంతతివారు యాగాశ్వాన్ని పట్టుకుని దొమ్మిగా అర్జునుడితో యుద్ధంచేయ సిద్ధపడ్డారు. అన్న చెప్పిన ప్రకారం అర్జునుడు వారిని మంచి చేసుకొనటానికి యత్నించాడు. కాని త్రిగర్త రాజైన సూర్యవర్మ తన సేనతో సహా అర్జునుణ్ణి ఎదుర్కొన్నాడు. సూర్యవర్మనూ, అతని తమ్ముణ్ణీ, మరి కొందరు యోధులనూ అర్జునుడు యుద్ధంలో చంపగా మిగిలినవారు శరణువేడారు.

గుర్రం ముందుకు పోయింది. ప్రాగ్జ్యోతిషపురం దగ్గిర భగదత్తుడి కొడుకు వజ్రదత్తుడు గొప్ప ఏనుగుపై వచ్చి అర్జునుణ్ణి ఎదిరించాడు. ఇద్దరికీ మూడు రోజులపాటు యుద్ధం జరిగింది. నాలుగోనాడు వజ్రదత్తుడు అర్జునుడికి ప్రాణాలతో దొరికాడు. అర్జునుడు అతనితో, "నీతో నాకు వైరం లేదు. మా అన్న అశ్వమేధ యాగం చేస్తున్నాడు. దానికి నీవు తప్పక రావాలి," అని చెప్పాడు.

Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'


బ్రిటానియా
క్రీమ్
క్రేకర్
Britannia Cream Cracker
Britannia Cream Cracker
Britannia Cream Cracker Biscuits
బ్రిటానియా క్రీమ్ క్రేకర్ శ్రేష్ఠమైన పదార్థాలతో చేయబడినవి. విరుస్తే పొర పొరలువచ్చి కరకరలాడుచూ నోరూరించును. వెన్న, క్రీమ్, బిస్కత్తుపైనాని తినుటకు అనువైనవి.
బ్రిటానియా క్రీమ్ క్రేకర్ రుచి, కమ్మదనం, నాణ్యతకు వాటికి అవేసాటి.
JWTBC 5774
బ్రిటానియా
బిస్కట్లు

IS:1011
ISI

FBMI

